గంగిరెడ్డి లక్ష్మీనారాయణ



రెండవ సంపుటి

యువభారతి సాహితీమిత్రుల
దసరా కథా సంకలనం

ప్రచురణ :




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

KATHA VAHINI - Volume 2
AN ANTHOLOGY OF STORIES
BY SAHITHIMITRAS OF YUVABHARATHI

యువభారతి

ప్రచురణ : 16

ప్రథమ ముద్రణ : 1,000 ప్రతులు
అక్టోబరు 7, 1973

ముఖపత్ర రచన :
శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :
విజయశ్రీ ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 500003.

కార్యాలయం :
**యు వ భా ర తి**
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001.

వెల : రెండు రూపాయలు.

# ప్రస్తావన



ఇది శరత్తు. ఎదఎదలో చైతన్యవిద్యుత్తులు పండించే సరిత్తు. ఈ శుభ సమయంలో 'కథావాహిని' ఉదయిస్తున్నది. యువభారతి సాహితీమిత్రుల కథాచైతన్యాన్ని ఈ కథావాహిని ఆవిష్కరిస్తున్నది. సాహితీమిత్రులు సహృదయ లోకానికి సమర్పిస్తున్న ద్వితీయ బహూకృతి ఇది. అంతేకాదు — యువభారతికి సాహితీమిత్రులతో ఏర్పడిన స్నేహబంధానికి అద్వితీయాక్షర కృతి ఇది. సాహితీమిత్ర సభ్యులలో ఇరవై మంది కథలను రెండు భాగాలుగా 'కథావాహిని' పేరుతో సాహితీలోకానికి సమర్పించుకోగల్గుతున్నందుకు సంతోషిస్తున్నాం.

సాహిత్యం జాతిలో చేతనాజ్యోతులను వెలిగిస్తుందని సమాజంలోని భిన్నభిన్న వ్యక్తులమధ్య, ఎన్నెన్నో కళాశక్తులమధ్య సామరస్యాన్నీ, సదవగాహననూ కలిగిస్తుందనే విశ్వాసంతో యువభారతి పదేళ్ళుగా పాటుబడుతున్నది. సమకాలీన సమాజాన్ని అందలి విలువలను పఠితృ ప్రపంచానికి పరిచయం చేయాలనే ధ్యేయంతో, ఉత్తమ సాహిత్యాన్ని వీలైనంత తక్కువ వెలకు సహృదయుల కందించాలనే అభిప్రాయంతో గతంలో యువభారతి రచనను ప్రచురించింది. విజ్ఞులచేత ఉపన్యాస లిప్పించి 'కావ్యలహరి' 'చైతన్యలహరి'గా రూపకల్పనచేసి రసికలోకానికి కానుకలుగా సమర్పించింది. 'మహతి'ని శతవ్యాసమహితంచేసి తెలుగుల వెలుగు చేతుల్లో పెట్టింది. ఈ విధంగా సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తున్న సందర్భంలో ఎందరెందరో సాహితీప్రియులతో మాకు సన్నిహిత సంబంధ మేర్పడింది. ఈ సంబంధమే 'సాహితీమిత్ర' పథకంగా రూపురేఖలను దిద్దుకున్నది. ఈ విజయదశమికి సాహితీమిత్రులసంఖ్య దాదాపు మూడువేల ఐదువందలు. కనీసం పదివేలమంది సాహితీమిత్రులతో నైనా సంబంధసాన్నిహిత్యాలు పెంపొందించుకోవాలని ప్రయత్నిస్తున్నాం.

మా సాహితీమిత్రులలో కవులు, కథకులు, వక్తలు, చిత్రకళాది లలితకళాయుక్తులూ ఉన్నారు. వీరిలో వైవిధ్యమున్నది. వైశారద్యమున్నది. కొందరికి

ప్రసిద్ధి ఉన్నది. మరికొందరికి ముందడుగు వేయాలనే ఉత్సాహమున్నది. వీరందరి రచనాశక్తులను సమీకరించాలని, దాగియున్న వారి ప్రతిభాప్రసూన పరిమళాన్ని పదిమందికీ పంచాలని సంకల్పించి ఈ ప్రమాదీచ ఉగాదికి తొలి ప్రయత్నంగా సాహితీమిత్రుల కవితాసంకలనం 'ఉషస్సు'తో స్వాగతం పలికాము. ఈ సందర్భంలోనే కథారచనా వ్యాసంగంలో అభిరుచిగల సాహితీ మిత్రులు కొందరు 'ఉషస్సు' పద్ధతిలో ఒక కథా సంకలనాన్నికూడ రూపొందించాలని సూచించారు. ద్విగుణీకృతమైన ఉత్సాహాన్ని ప్రదర్శించారు. వారి ప్రోత్సాహాన్ని ప్రేరణగా అందుకొని మలిప్రయత్నంగా ఈ విజయదశమికి సాహితీమిత్రుల కథాసంకలనాన్ని వెలువరించాలని అనుకున్నాం. ప్రయత్నించాం. ఆ సంకల్ప కృషి ఫలితమే ఈ 'కథావాహిని'. సాహితీమిత్రుల హృదయశిఖరాలలో ఉదయించి కదలివచ్చిన ప్రతిభాసుధావాహిని. ఈ రకంగా యువభారతికి సాహితీమిత్రులతోగల సాహితీ బాంధవ్యానికి ఈ 'కథావాహిని' సంకలనాలు సరసవర్ణసంకేతాలు.

ఈ విజయదశమీ కథాసంకలనోద్దేశాన్ని ఉగాది కార్యక్రమ సందర్భంలోనే ప్రకటించాం. దాదాపు 65 మంది సాహితీమిత్రులు పాల్గొన్నారు. వచ్చినదానిలో మేమిదివరకే సూచించినమేరకు – మేలైనవిగా కనిపించిన ఇరవై కథలను, పదేసిచొప్పున రెండు భాగాలుగా 'కథావాహిని' పేరుతో సాహిత్యలోకానికి విజయదశమి కానుకగా అందిస్తున్నాం.

ఉగాది కానుకగా—సాహితీమిత్రుల తొలి ప్రచురణగా 'ఉషస్సు' కవితా సంకలనాన్ని వెలువరించినప్పుడు విమర్శకులు ఎన్నో విసుర్లు విసిరారు. వెలుగుచూడని రచనలకు విస్తృత వేదికనేర్పాటు చేయడంకోసం—అందరికీ తెలిసినవారినేగాక అజ్ఞాతంగానున్న ప్రజ్ఞామూర్తులను పరిచయం చేయడంకోసం—ఉషస్సును వెలువరిస్తున్నామని 'ఉషస్సు' ప్రస్తావనలో తెలిపినా కొందరు సహృదయులు మమ్మల్ని అర్థంచేసికొనలేదు. నిశితంగా, నిర్దాక్షిణ్యంగా నిందించారు. రాశియేగాని వాసిలేదని, రచనల్లో రమ్యతలేదని, కసిగా కలంలోని బలాన్ని ప్రదర్శించారు. అయినా మేమేమీ అనుకోలేదు. అనుకోంగూడా. దీనికి కారణం—సాహితీమిత్రుల ప్రతిభాప్రదర్శనకు యువభారతి వేదికగా—ప్రాతిపదికగా కలిగిస్తున్న అవకాశం అభిలషణీయమనే ఆలోచన మరింత బలంగా కలగడమే. దీనికితోడుగా సహృదయలోకం మా వెన్నుతట్టి నిలిచి

హర్షపూర్వకంగా తన సౌముఖ్యాన్నీ—సహకారాన్నీ వర్షించడమే. ఈ విధంగా ఒకవైపు నిశితంగా వచ్చిన నిందలను—మరోవైపు ఆదరాభిమానాలతో వచ్చే అభినందనలను హృదయపూర్వకంగా అందుకున్నామేగాని అతిశయోక్తిగా నేలనువిడిచి నింగినందుకోలేదు. పేరుమోసిన మహా కవుల తొలిరచనలను పరిశీలిస్తే సుప్తమైయున్న కళాబీజాలను అంకురింపజేయాలనే సాహిత్యోద్య మాసక్తియే తప్ప అచ్చువేసిన ప్రత్యక్షరం మహాకవిత్వపు వోహళింపుతో ఘుమఘుమలాడుతుందని మా విశ్వాసం కాదు. సరికొత్త పద్ధతులతో సాహి త్యోద్యమాన్ని నిర్వహిస్తున్న యువభారతి అభినవగమనానికి ఈ విమర్శలు అంతగా చేయూత నివ్వలేకపోతున్నాయనే మా ప్రత్యయం.

గతంలో అనుభవాలు నేర్పిన పాఠాలను దృష్టిలోనుంచుకొని కొన్ని నిబంధన లేర్పరచి, పరిశీలించి సరసమైన ఇరవై కథలను మాత్రమే ఎన్నిక చేసి, మరో అడుగు ముందుకు బలంగా—సహృదయులైన సాహితీమిత్రులు సాహిత్య మర్మజ్ఞులు అనుక్షణం అందించే సహకారఫలంగా—యువభారతి తన దశమ వార్షికోత్సవాల శుభవేళ ఈ 'కథావాహిని'ని సమర్పిస్తున్నది. సరస పఠితృలోకం ఈ కథాసాహితిని ఆదరిస్తుందని ఆశిస్తున్నది. ఈ ఆశయం నిజ మైతే—ప్రయోజనవంతమని ఋజువైతే—సాహితీమిత్రులతోడి మైత్రిని మరింత సంపన్నం చేసికోవాలని, వారి సాయంతో ధ్యేయాన్ని చేరుకోవాలని కోరు కుంటున్నాం.

ఈ విజయదశమినాడు ఈ 'కథావాహిని'తోపాటు యువభారతీయుల కథా సంకలనం 'ఉదయా'న్ని తమ కరకమలాలతో ఆవిష్కరించడానికి సౌహార్దంతో సమ్మతించిన సౌజన్యమూర్తులు, సుప్రసిద్ధ పాత్రికేయులు శ్రీ రావూరు వెంకట సత్యనారాయణగారికి, ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన సాహితీ బంధువులు ఆచార్య డా॥ బి. ఆర్. శాస్త్రిగారికి, ముఖ్యఅతిధులుగా విచ్చేసి ఆశీస్సులందించిన సరసహృదయులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్య దర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి మా హార్దికాభివందనాలు.

ఈ 'కథావాహిని'లోని రచనలను ప్రత్యక్షరం పరిశీలించి, పరిశ్రమించి కథల్ని ఎన్నికచేసి ప్రచురణలో తోడ్పడడమేగాక ముఖపత్రాన్నికూడ ముద్దుగా తీర్చిదిద్దిన కథా, కవితా చిత్రకళాది బహుముఖ ప్రతిభాశాలురు, యువభారతి గౌరవ సభ్యులు అయిన శ్రీ శీలా వీర్రాజుగారికి మే మెంత ఋణపడియున్నామో మాటల్లో చెప్పలేం.

ఈ సంకలనంలో ప్రచురించడానికి తమ కథలను అందించి అన్నివిధాలా సహకరించిన, కథావాహిని రచయితల సౌహార్దానికీ, ఔదార్యానికీ మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

కథాసంకలన ప్రచురణను పర్యవేక్షించిన గౌరవ సభ్యులు, ప్రధాన సంపాదకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి మా ధన్యవాదాలు.

యువభారతి కార్యాలయంలో సకలవిధాలా మాకు సాయపడి ప్రచురణను సుకరంచేసిన మిత్రులు శ్రీ రాధాకృష్ణమూర్తిగారికి కృతజ్ఞతలు.

ఈ సంకలన ముద్రణలో భద్రస్థానం వహించిన యువభారతి సమావేశకర్త శ్రీ టి. కె. విజయకుమార్‌గారి సహకారాన్ని ఎన్నడూ మరచిపోలేం.

కథావాహిని ముఖపత్రాన్ని అచ్చొత్తిన విస్టాస్ ప్రింటర్సువారికి, సకాలానికి కథాసంకలనాన్ని అచ్చువేసిన విజయశ్రీ ప్రింటింగు వర్క్సు, శ్రీ ఎ. సూర్యనారాయణగారికి కృతజ్ఞతాబద్ధులం.

సాహితీ చైతన్యంతో సాహితీమిత్రుల సహకార సౌజన్యాలు చేయూతగా 'కథావాహిని'వంటి విజయదశమి కార్యక్రమాలు నిర్వహిస్తూ ఇంకా ముందుకు సాగిపోవాలనుకున్న యువభారతికి సహృదయలోకం సముచితాదరాభిమానాలను అందిస్తుందని తద్వారా సాహిత్యసమున్మీలనానికి సహకరిస్తుందని ఆశిస్తున్నాం.

తిరుమల శ్రీనివాసాచార్యులు
విశ్వనాథ సూర్యనారాయణ
యువభారతి

విజయదశమి
6–10–1973

# కథాలాపం



కథానికా ప్రక్రియ యితర భాషా సాహిత్యాలలోవలె తెలుగు సాహిత్యంలో కూడా బాగా ప్రచారంలోకి వచ్చింది. ఈనాడు కథల పేరుచెప్పుకుని ఎన్నో పత్రికలు ఊపిరి పోసుకుంటున్నాయి. ఎందరెందరో దానిమీద ఆధారపడి బ్రతుకుతున్నారు. చాలామంది దీనిని వ్యాపారంగా చేసుకుని లాభిస్తున్నారు—ఒక్క రచయిత తప్ప. ఇప్పుడు తెలుగు కథ అక్షరజ్ఞానంవున్న ప్రతి తెలుగు గడపా తొక్కే స్థితికి వచ్చింది. వెళ్ళి, తిష్టవేసుకునే స్థితిలో ఉన్నా లేకున్నా కనీసం చుట్టపు చూపుగానైనా వెళ్ళి పలకరించి వస్తోంది. తెలుగు కథ యీ స్థితికి చేరడం ఎంతగానో హర్షించదగ్గ విషయం.

అయితే యింతమాత్రంచేత తెలుగు గడప బాగా అభివృద్ధి చెందిందని మురిసిపోడానికి వీల్లేదు. ఇది కేవలం తెలుగు కథకుగల ప్రాచుర్యాన్ని మాత్రమే తెలుపుతోంది. ప్రచారం వేరు, ప్రతిభవేరు. రాశినిబట్టి గుణాన్ని లెక్కించడానికి వీల్లేదు. పదిమందిదగ్గరకీ తెలుగుకథ వెళ్ళగలిగిందంటే దానికి ఎన్నో కారణాలు వుండొచ్చు. ప్రజల్లో అక్షరజ్ఞానం పెరగడంవల్ల కావచ్చు. పత్రికలు కొనడం ఒక రకమైన స్టేటస్‌గా భావించడంవల్లకావచ్చు. ఇది మంచి కాలక్షేపం అనిపించడంవల్ల కావచ్చు. ఏదిఏమైనా ముందు ముందైనా సంఖ్యతోపాటు గుణంలోనూ తెలుగుకథ ఎదగడానికి అనువైన వాతావరణాన్ని యిది సృష్టించడానికి తోడ్పడగలదని ఆశిద్దాం.

తెలుగుదేశంలో కథకులకు కొరతలేదు. ఏటా ఉత్పత్తి అవుతోన్న కథల సంఖ్య చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అచ్చయినవి లెక్కపెట్టాలంటేనే కష్టం. కానివికూడా లెక్కలోకి తీసుకుంటే మరిక చెప్పనే అక్కరలేదు. నిజానికి, తయారవుతోన్న తెలుగు కథలకు తగినంత ఔట్‌లెట్ లేదనే చెప్పాలి.

తెలుగు మాట్లాడే జనాభాతో పోల్చితే మనకున్న తెలుగు పత్రికలు

చాలవు. అందువల్ల చాలామంది ఔత్సాహిక రచయితలు వెలుగులోకి రాలేక పోతున్నారు. తమ ప్రతిభని ప్రదర్శించే మార్గంలేక నీరుగారి పోతున్నారు.

ఈనాడు కథకు మంచి గిరాకీ వుందని అంతా అంటున్నారు. పత్రికలు కథలమీదే జీవిస్తున్నాయి. కథల్ని ప్రచురించి ప్రజల్ని ఆకట్టుకుంటున్నాయి. ఈ నాటి కథ చాలామంది దగ్గరకు వెళతోంది. అన్ని రకాలవారూ చదువు తున్నారు. ఇంతమాత్రంచేత తెలుగు కథకు గిరాకీ పెరిగిందనుకోవడం వట్టి భ్రమ.

ఉన్న సాహిత్య ప్రక్రియల్లో యీనాడు అన్నిటికన్న ఎక్కువగా వుత్పత్తి అవుతోన్న ప్రక్రియ–కథ. ఎక్కువమంది రాస్తున్నారు. ఎక్కువగా ఉత్పత్తి అవుతోంది. చదివేవాళ్ళూ ఎక్కువే. అయినా కథల సంపుటికి అమ్మ కాలులేవు. ఇంత విరివిగా ఆదరింప బడుతోన్న కథకి మేగజైనులో తప్ప పుస్తకరూపంలో ఆదరణ లేదు. కథాసంపుటాలు ఏమూలో మూలుగుతుంటాయి. ప్రచురణ కర్తలు కథాసంపుటాల్ని అచ్చువేయడానికి ముందుకు రారు. నవలల కున్న గిరాకీ కథలకు లేదు. తెలుగు కథ బాగా అభివృద్ధి పొందిందనీ, దీనికి గిరాకీ పెరిగిందనీ అనుకోవడంలో నిజంలేదు.

తెలుగు రచయితకు తన కథ అచ్చయితే వచ్చే ప్రతిఫలం అచ్చయిన ఓ కాపీ మాత్రమే. డబ్బిచ్చే పత్రికల్ని వేళ్ళమీద లెక్కెట్టొచ్చు. ఇచ్చే పత్రి కలు కూడా అంతంత మాత్రంగానే యిస్తున్నాయి.

ఈనాడు తెలుగు కథాసంపుటాలకు ప్రచురణకర్తలు లేక రచయితలే స్వయంగా అచ్చు వేసుకోవలసి వస్తోంది. వాటికి అమ్మకాలుండవు. పెట్టిన పెట్టుబడి రాదు. అప్పుచేసో, సంపాదనలో ఏదోవిధంగా సర్దుబాటు చేసుకునో స్వయంగా తనే పుస్తకం వేసుకుంటే నష్టమేకాని లాభం వుండదు. అందుకని ప్రచురణకర్తల కాళ్ళా వేళ్ళాపడి యాభయ్యో వందో కాపీలు యిస్తే చాలని ఒప్పించి అచ్చు వేయించుకోక తప్పడంలేదు. కొందరు పదిమందీ కలిసి తలా కొంత డబ్బు వేసుకుని తమ కథల్ని పుస్తకానికి ఎక్కిస్తున్నారు.

ఈ కథల సంపుటి అటువంటిదే.

యువభారతి సంస్థ పెద్దఎత్తున సాహిత్య కార్యక్రమాలను నిర్వహించ డంలో విపరీతంగా సాహితీకృషి కొనసాగించడంలో విశేషంగా తమ సహాయ

సహకారాలను అందజేస్తున్న సాహితీమిత్రులు చాలామంది వున్నారు. వీరిలో సృజనాత్మక శక్తికి కొదవలేదు. చొరవలేకపోవడంవల్లా, అవకాశాలు లేకపోవడంవల్లా వీరిలో అంతర్గతంగావున్న యీ ప్రతిభ లోలోపలే అణగారిపోతోంది. వీరిలోవున్న యీ ప్రతిభని బయటికితీసి నలుగురిముందూపెట్టే ఉద్దేశంతో యువభారతి తమకు సహాయపడుతోన్న సాహితీమిత్రుల కథలను సేకరించి, మేలైనవి ఎన్నికచేసి 'కథావాహిని' పేరుతో రెండు సంపుటాలుగా ప్రచురిస్తోంది. సగం ఖర్చు రచయితలు భరించగా మిగతా సగం యువభారతి భరిస్తోంది.

ఇందులోని రచయితల్లో ఒకరిద్దరు పాఠకులకు సుపరిచితులు. మిగిలినవారు కొత్తవారు. ప్రసిద్ధ తెలుగు కథకుల సరసన వీరు నిలబడలేక పోవచ్చు. కాని బహుళ ప్రచారంపొందిన చాలామంది రచయితల కథలపక్కన యీ కథలు నిలబడగలవని నా నమ్మకం. ఈనాడు పత్రికల్లో అచ్చవుతోన్న కథల స్థాయికి యివి సరితూగగలవనే నా విశ్వాసం.

వీరిలో చాలామంది యిప్పుడిప్పుడే అడుగులు వేస్తున్నారు. వీరి దృష్టంతా యిప్పుడు పడిపోకుండా బేలన్సుకాసుకుంటూ అడుగుతర్వాత అడుగు వేయడంమీదే నిలచివుంటుంది. తూలిపోకుండా నిలదొక్కుకుని నడవడం అలవాటయ్యాక ఎవరిదారి వారు వెతుక్కుంటారు. అప్పుడు తమ మార్గాలేమిటో స్పష్టమైన అవగాహన వారికి ఏర్పడుతుంది.

ఈ కథకులు తమ యీ ప్రతిభకు మరింత మెరుగులు దిద్దుకుని, నిరంతరంగా కృషిచేస్తూ ముందుముందు చక్కటి రచయితలుగా నిలబడగలరని ఆశిస్తున్నాను.

—శీలా వీర్రాజు



సాహితీమిత్రులు
* యువభారతి




స్పందనం జీవలక్షణం।
రసస్పందనం సహృదయలక్షణం।
రసహృదయం సాహిత్యానికి జీవనం।

మా కృషిలో పాలుపంచుకునేందుకై సహృదయులయిన సాహిత్యాభిమానులకు అందిస్తున్న ఆహ్వానం 'సాహితీమిత్ర'. జాతి పురోగమనానికి సాహిత్యవికాసం, దాని ప్రభావం అవసరమని భావిస్తూ ఉత్తమ సాహిత్య ప్రచురణానికి యథాశక్తి ప్రయత్నిస్తున్నాము. 'సాహితీమిత్రు'లుగా చేరడం అంటే మీ సహాయ సహకారాలను మా సాహిత్యకృషికి అందించటానికి ఒప్పుకుంటున్నారన్నమాట! యువభారతి సాహితీమిత్రులుగా చేరడంవల్ల సమకూరే సదుపాయాలు :

- ప్రతి సంవత్సరం ఐదు రూపాయలు చెల్లించడంతో, చేరిననాటినుండి ఒక సంవత్సరంపాటు యువభారతి సాహితీమిత్రులుగా పరిగణింప బడతారు.
- తక్షణమే ఒక ఉచిత పుస్తకం.
- 1-12-73 లోగా చేరేవారికి 1973 వ సంవత్సరంలో, మూడు రూపాయల ప్రచురణ పూర్వ విరాళంపై ప్రచురింపబడే వికాసలహరి ఉచితంగా అందుతుంది. నేరుగా అందించడంగాని-పోస్టుద్వారా పంపడంగాని జరుగుతుంది.
- 2-12-73 తరువాత చేరేవారికి 1974 లో ప్రచురించనున్న లహరి అందించబడుతుంది.
- యువభారతి ప్రచురించే, కవితాసంకలనం, కథానికా సంకలనాలలో పాల్గొనే అవకాశం ఉంటుంది.
- యువభారతి మిగిలిన ప్రచురణలను 25% మినహాయింపుతో సొంతం చేసుకునే సదుపాయం మీరు చేరిననాటినుండి ఒక సంవత్సరంపాటు ఉంటుంది.
- యువభారతి సమావేశాలలో మీరు సాహితీమిత్రులుగా, అతిథులుగా పాల్గొనవచ్చును.
- అన్నింటికన్న మిన్న యువభారతికి తోడ్పడగలుగుతున్నామన్న సంతృప్తి; మీకా సంతృప్తి కలిగించేలా యువభారతిని తీర్చిదిద్దడంలో మీ సహకారం అందించటం.

సాహితీవాహినిలో
మొదటి తరంగం

# మందార మకరందాలు

***************************************************************

# సా హి తీ వా హి ని

సమాజంలో సాహితీచైతన్యాన్ని నవనవోన్మేషంగా వికసింపచేయాలని యువభారతి లక్ష్యం. గతంలోని మంచిని ప్రపంచిస్తూ వర్తమానంలోని కర్తవ్యాన్ని ప్రబోధించేలా ప్రచురణ కార్యక్రమాన్ని రూపొందించటం యువభారతి అభిమతం. ప్రసిద్ధ తెలుగుసాహిత్యంలోని సౌందర్యం ప్రజావాహినికి ప్రత్యక్షమయ్యేలా రూపొందించిన ప్రచురణ కార్యక్రమం 'సాహితీవాహిని' ఒక మహాకవి కవితా వ్యక్తిత్వాన్ని కవితాత్మగల మరొక వ్యాఖ్యాత కమనీయశైలిలో రమణీయ వ్యాఖ్యతో ప్రజానీకానికందించంటం ఈ కార్యక్రమ స్వరూపం. రంగురంగుల ముఖచిత్రంతో అందమైన గెటప్పుతో ముగ్ధమోహనంగా ప్రచురింపబడే సాహితీవాహిని ప్రతి తరంగాన్నీ ప్రతి పఠితకూ ఒక్క రూపాయికే అందించటం యువభారతి ప్రయత్నం.

భాగవత మకరందాన్ని ప్రజానీకానికి భక్తిరసాయనంగా అందించిన బమ్మెర పోతన తెలుగులో ప్రసిద్ధ కవి. ఆయన పద్యాలు తెలుగు వాక్కులకు తియ్యని ఆమెతలు. కొన్ని పద్యాలు తెలుగులో నిలిచిన సామెతలు. తెలుగు తియ్యందనాలు జాలువారిన కొన్ని పోతన పద్యాలకు డా॥ సి. నారాయణరెడ్డిగారి కమనీయ వ్యాఖ్యతో వెలువడుతున్న మొదటి తరంగం 'మందారమకరందాలు'.

మానవతావాదానికి మహామేరువుగా నిలచి నిర్మొగమాటంగా జాతిలోని తెలుపునలుపుల్ని తేటతెలుగులో సమీక్షించి, ప్రజాహృదయాల్లో శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్న వేమన, కవితామూర్తిని రసార్ద్రమైన ఆరుద్ర వ్యాఖ్యానంతో పరిచయంచేసే 'వేమన్న వేదం' సాహితీవాహినిలో రెండవ తరంగం.

సాహితీవాహిని ప్రజానీకంలో ప్రాచుర్యం చెందాలనీ, ప్రతి యింటా ఈ సాహితీ తరంగం ప్రసారంకావాలనీ, ప్రతి తరంగం దాని మాధుర్యాన్ని ఆస్వాదించాలనీ మనసారా ఆహ్వానించాలనీ—యువభారతి అభిలషిస్తున్నది.

***************************************************************

సాహితీవాహినిలో
రెండవ తరంగం

# వేమన్న వేదం

# అనుక్రమణిక

గుంగిశెట్టి లక్ష్మీనారాయణ

# తీరని ఆశల తమస్సు క్రింద

చంద్రముఖి వేణు

తూర్పుదిక్కున తిమిరాన్ని చీలుస్తూ
మార్పులేని సూరీడు మెల్లిగా వస్తున్నాడు
గడ్డిమీద నిల్చిన తుషార బిందువుల ఒడిలో
కటారి కిరణాల వెదజల్లుతూ
సుడిగాలి పొరలు చీల్చుకొని
చిరువాయువులా వేలార్చుకొని
వడివడిగా వస్తున్నాడు
వాడివాడి కిరణాల వెల్గుతో
వేడివేడి చురకలు వేస్తున్నాడు
ప్రకృతిని చూస్తూ-పల్లవించి హృదయం పాడే పల్లవిని
పాటగా పాడుకుంటున్నాడు అనంతమూర్తి
గూటిలోని గువ్వ అరచినట్లు
ఠన్‌ఠన్ మని ఏడ్చింది కాలమాని
ఎప్పటిదో తాతల నాటిది
పది సంవత్సరాల తరువాత నిన్నరాత్రి
కీ ఇచ్చిన తరువాత మేల్కొన్న కాలమాని
ఆరు గంటలు కొట్టింది
నిదుర కన్నుల నలుపుకుంటూ
'ఇంకా ఆరేనా! నా హృదయతపన నీకే(తెలుసు?' నన్నట్లు చూస్తూ
నిరీక్షణలోనే ఈ జీవితం ముగుస్తుందేమోనన్న భయంతో
కాలమానికేసి చూపుల కత్తుల్ని విసిరాడు
రాత్రి అతని కనురెప్పల్లో దాగిన నల్లనువ్వులాంటి రాక్షసాలు
నలిచిన చేతులకు కలం ఏడ్చిన కన్నీటిలా తగిలాయి
నిశ్శబ్దాన్ని చీల్చలేని చూపుల్ని గూడెం ఆవలివైపుకు గురిచేసి
గతపు ఘడియల ప్రవాహానికి గడియతీసి
తాననుభవించిన బాల్యాన్ని ఆహ్వానించుకున్నాడు
అతనెప్పుడూ కోరుకునే బాల్యం
అతని ఊహల్లో ఉద్భవిల్లి కేరుమంది

## 2

అమ్మానాన్నల ఆప్యాయతకు నోచుకోని బిడ్డ తాను
ఆనందంగా గడవాల్సింది బాల్యం-కాని
తనవన్నీ అగావుకోర్కెలు తీరేవి కావు.

అనాధకెవరూ ఆశ్రయం ఇవ్వలేని సమయంలో
ఆశ్రయం ఇచ్చాడు మామయ్య
ఆనందాన్ని నరుకుతున్న కాలపుకత్తులు ఉన్నా!

కూలిన సమాధిమీద మొలిచిన తాజా గులాబీలా
అంధకారంలో ఆముదపు దీపంలా
నా జీవితంలో చిన్నని వెల్గు రేఖలా
అందంలో అమ్మపోలికే అయినా
డెందంలో తండ్రి పోలికల్ని పొదుగుకున్న వసుంధర-

అత్తయ్య మెత్తమెత్తగా వడ్డించే
వేడివేడి ఆశీర్వచనాలకు భయపడి
అర్ధరాత్రిదాకా ఊరిచివరి శివాలయంలో
మంచితీర్థంతో ఏకాదశీవ్రతం గడిపి
వస్తున్నవేళ వస్తున్న నూటైదు డిగ్రీల కోపాన్ని
నార్మల్‌కు కుదించుకొని
కృష్ణానదిని ఆ కన్నుల్లో పుట్టించుకుంటూ
చెక్కిళ్ళపొలాలకు నీరెట్టుకుంటూ
బయలుదేరిన తనకు-దీనంగా నిల్చి
నిద్రను నిటారుగా తన కనురెప్పలమీద నిల్పి
చకోరంలా తనకోసం—

పడసాల్లోంచి, మొగసాలదాకా
మొగసాల్లోంచి, ఆ వీధిమలుపుదాకా
అలిసిన కన్నుల్తో-ఆతృతగా చూస్తూ
తనకోసం నిల్చున్న-వసుంధర—

వెన్నెల్లో డాబామీద కూర్చొని
తింటున్నదాన్ని తనకు పంచిపెడ్తూ

"బావా ఇలా ఇంకెప్పుడూ వెళ్ళవుకదూ!"—
అని ప్రేమపూర్ణ సజలనేత్రాలతో
అభ్యర్థనలోనే మందలించే వసుంధర—

అతని ఊహల్లోని బాల్యం చెదఱిపోయింది
అవును నా వసుంధరే ఇప్పుడు వస్తుంది
అనుకున్నాడు ఆనందంగా అనంతమూర్తి—

## 3

చల్లనిచేతుల్ని గుండెలకేసి అదుముకొని
నిట్టూర్పుల ఊర్పులు ఆ గది
—నిశ్శబ్దాన్ని చీలుస్తున్నప్పుడు
ఆశతో కన్నులు అరమోడ్పులై
తలుపులమీద ఆత్రంగా చూపులశూలాన్ని దింపుతున్నప్పుడు,
మెత్తగా సున్నితంగా తలుపులమీద
వేళ్ళతో బాదిన చప్పుడువిన్న అనంతమూర్తి,
హృదయకవాటం మూసి ఇంటికవాటం తెరచి
ఎదుటి ఆకారాన్ని చూసి బాధగా కళ్ళుమూసి
మూగగా మనసులోనే గొణుక్కున్నాడు

రంగుమాసిన బొమ్మా! తన వసూ—
అలంకారం లేనిదా! తన వసూ—
ఐదవతనం లేనిదా! తన వసూ—
భగవాన్ నా వసుంధర ఈవిడ కాకూడదు
హృదయ కుహరంలో దాగిన బాధ
వెల్లువికి కన్నీటిగా కదిలివచ్చింది
కానీ! నిజం నిలవేసిందతన్ని—
"బావా క్షేమమా?" నూతిలో రాళ్ళేసినట్లుగా
ఆమె శుష్క స్వరం వణికింది.

"వెలుగుచూడని ఈ జీవితంకంటె
చిఱుగులుపడ్డ చీకటి జీవితంచాలు
నీ వెలుగులో నేనీ నిజాన్ని చూడలేను" అని
అనుకుంటూ!
అంతర్ముఖుడై ఎక్కివస్తున్న అంశుమాలిని
తిట్టుకుంటూ!
బాధగా నవ్వుకున్నాడు

గత స్మృతిలోని చిరిగిన ఊహల్ని ముందుంచుకొని
కారణాలు వెతుక్కున్నాడు అనంతమూర్తి

"బావా! కాలంగడిచినన్ని రోజులు
గమ్యంలేక తిరిగావా?
ఆశ అడవిపాలై నిరాశలో కాలుతున్నప్పుడు
ఇంకా ఏముందని, ఇక్కడికొచ్చావ్?" ప్రశ్నించింది

"నీకోసం వసూ" అతని ప్రతిధ్వని

"అవును బావా!" నీవు నాకోసమే
ఇన్నాళ్ళూ నిద్రాణంగా ఉన్నావ్!
కానీ, కాలం మించిపోయింది
ఆనాడు నీవు వినలేదు
సమాజపు సముద్రాన్ని ఎదురీద్దామంటే?"
అది వసుంధర ఆవేదన.

"అవును వసూ! నాది తప్పే, కాని
పచ్చిపచ్చిగానున్న యవ్వనపుదార్లంట
ఎక్కడో జారి బ్రతుకుల బలిచేస్తామేమో
అన్నభయంతో ఉన్నప్పుడు
ఇంకా మాయని బాల్యముద్రల్లోనున్న యవ్వనం
అది అప్పుడప్పుడే ఉద్రేకాల్ని పొదుగుతున్న యవ్వనం
అందుకే అవకతవక అడుగేయరాదని
అనుకున్నా! వసూ! కాని
నాకు నీపై ప్రేమలేకా కాదు!
నాకా ధైర్యంలేకా కాదు!–
నాలో నీవునాటిన ప్రేమాంకిత గులాబీలు
జీవితాంతం నాలో చిగుర్చుతాయని
దాని ముళ్ళే నా జీవితంలో
చిల్లులు పడేలా నన్ను తొలుస్తాయని
నాలోని నీప్రతిమ అణువణువునా
నన్ను అస్తమానం నిలేస్తుంటుందని
నాకానాడు తెలియదు."–

"కాని బావా! నాలో సంచలనాన్ని రేపుతూ,
నాహృదయపు మడతలమధ్య
నలిగి చితికిపోతున్న-నాలోనే చివికిపోతున్న
ఆశలకొనలో వ్రేలాడుతున్న ఒకేఒక చిన్నకోర్కె"
వసూ అర్జీపెట్టుకుంది

"ఏమిటి"
"మనసు లెక్కడున్నా! మనుగడలైనా,
ఇంకొకరితో సాగింపవచ్చుగా!
వెచ్చని జీవితంలో పచ్చని పూలను
పూయించుకోవచ్చుగా—
మమతలకు సంకెళ్ళు వేయడానికి
మనసుకు పగ్గాలుంటాయప్పుడు
అందుకే బావా! నీవు........"
"ఆపు వసూ! ఆపు
అర్థంలేని కోర్కెల్ని మనసులో సంధించి
పుండ్లమీద కారంచల్లి - వేదల్ని వెలికితీయకు
శూలంతో పొడవకు
నా కోర్కెల కేనాడో సమాధి కట్టాను
నీ కోర్కెలకోసం ఇల్లెక్కడ కట్టేది?
తిమిరం ఆవరించిన ఈ ప్రకృతిలో
ఇంకో కాగడా అవసరంలేదు
నీవే నిండిన ఈ ఒరలో
ఇంకో కత్తిని దాచి
హృదయం ముక్కలు చేసుకోలేను."
హృదయంలోని పొగనొదిలాడు అనంతమూర్తి

## 4

ఉషోదయం పొగమంచు దుప్పట్లో శరీరాన్ని దాచుకుంది
అడుగులసవ్వడి చెవుల్లో ఎంతో మధురంగా
ఏదో ఊహల్లోకి త్రోసిపోయిందతన్ని
"రాత్రంతా కన్నీళ్ళతో నిద్రను భేదించావా బావా?"
వసూకంఠం పరామర్శించింది
"లేదు - లేదు అమావాస్య చీల్చే నీ చూపులు
నా జీవిత అమావాస్య చీకట్లను చీల్చాలని
నా కళ్ళతో నిన్ను బంధింప జూస్తున్నా!"
ఎందుకో అవ్యక్త రాగాన్ని పల్లవించిందతని కంఠం.

అతని చూపుల కొసలలో ప్రేలాడుతున్న ఆమె
విస్మయంగా—
తన కనురెప్పల్లో అతని ప్రతిబింబాన్ని చూస్తూ
కనురెప్పల తాటిస్తూ ప్రతిమయై నిలిచింది.
"బావా!" జీరవోయిందాకంఠం
"తప్పన్నానా? హృదయాన్ని నీముందుంచాను వసూ!
కష్టకాలం రాల్చిన, చీకటి హిమంలో తడిసిన
నా హృదయం మీది గాయాల తడి ఆరలేదు
ఏకాంతంగా! నీకు దూరంగా
దిగంతాలకేసి దీనంగా చూస్తూ
కాలం రాల్చే కన్నీటి బొట్లు గోతుల్ని
పూడ్చుకోవాలనుకోవటం నాది పొరపాటా?
ఆకాశహర్మ్యాల నిర్మిస్తున్న నా ఎడద
అకస్మాత్తుగా అంటుకొంది
ఆ అగ్నిశిఖల కొసల్లో కాలుతున్న నేను
నీ మమతల జల్లుతో
నా హృదయపు కార్చిచ్చు చల్లార్చుకోవచ్చా? వసూ
అది నీవు వినా ఎవరితరమూ కాదు"
మాటలే హృదయానికి ప్రతీకగా నిలిపాడు
ఆవేదన గ్రుమ్మరించి నిట్టూర్పు విడిచాడు
"వద్దు బావా! వద్దు, ఆ రోజు నాహ్వానించకు
తీరని ఆశల రథచక్రాల క్రింద నలిగినదాన్ని
రేకులన్నీ ఏనాడో దేవుని కంకితం చేసినదాన్ని
బాకులన్నిటినీ హృదయంలో పొడుచుకున్నదాన్ని
కాలం నింపిన ఈ కంటి గోదావరీజలాలు
కంట్లో ఆరినా! ఇంకా ఈ గోటిలోని తడి ఆరలేదు
ప్రేమాలయం కాదిది బావా!
శిథిలాలయం
మమతలు పెంచుకున్న మన హృదయాలు
నాగరికులమధ్య ఎప్పుడో తెగిపోయాయి

అయినా! ఒక్కటి నిజం
నీ కోసం ఈ ప్రసూనం పూచింది
ఈ పూవంతా ప్రేమనే మధువు నిండివుంది
కానీ—ఆస్వాదనకు పనికిరాని విషం అది
ఆమె హృదయపు కిటికీలోంచి జారుతున్న
అవిరళధారా మధుబిందువుల్ని
తన ఉత్తరీయంలో మూట కడ్తూ
"చాలు, వసూ! చాలు—
ఈ ఒక్కపదం వినడానికే ఈ జీవం నిలిచింది
వేదనల పరదావెనుక దాక్కున్న ఆ ఆనందంచాలు"
ఆవేశంలో అతని అంతరంగం ఆలాపించింది
ఆ ఆలాపనలోనే ఎప్పుడో వసూ కంఠం
ఎండ్రిన్ మత్తులో
శతశరత్తుల జీవితాన్ని మరచి
"బావా! బావా!" అంటూ మూగవోయింది.



# వానకురిసిన రాత్రి

## ద్విభాష్యం రాజేశ్వరరావు

నేను ముత్యపు చిప్పను కాను!

నాకు ఆనందం కలిగించటానికి స్వాతి చినుకులే అక్కరలేదు!

వానచినుకులు ఎప్పుడు నింగినుండి రాలినా నాకిష్టమే!

నల్లని మబ్బులనుండి పూసల దండల్లా, చినుకులు పడుతూవుంటే చూడటానికి నాకెంతో ఆహ్లాదంగా వుంటుంది. మట్టిమీద చినుకులు పడిన తరువాత గాలిమోసుకొచ్చే వింత పరిమళమంటే నాకు ఎంతో ఇష్టం. చీకటి సుందరి పెదవిమీద చిరునవ్వులా వెలిగి మాయమయ్యే మెరుపులు చూడటంలో నాకు అమితమైన తృప్తి లభ్యమవుతుంది.

వాన కురుస్తున్నపుడు గదిలో కూర్చుని వెచ్చగా సిగరెట్లు పీలుస్తూ కథలు వ్రాయటం నాకు ఒక హాబీలాంటిది.

కాని రెండు సంవత్సరాలక్రితం జరిగిన ఆ సంఘటన నన్ను పూర్తిగా మార్చివేసింది. ఇప్పుడు వర్షం కురుస్తూ వుంటే ఆనాటి దృశ్యమే నా కనుల ముందు ప్రత్యక్షమౌతుంది. నా పాపాన్ని, కుటిలత్వాన్ని, స్వార్థాన్నీ ఎత్తి చూపి, ఎగతాళిచేస్తూ వుంటుంది ఆ సంఘటన! ఇపుడు వర్షం కురుస్తూవుంటే ఆ హోరు ఎవరో బాధగా మూల్గుతున్నట్లు, రాక్షసి ప్రసవవేదనను అనుభవిస్తున్నట్లు వినిపిస్తుంది. కొన్నికోట్ల గొంతులు వెక్కి వెక్కి ఏడుస్తూవుంటే, ఆ కన్నీరే వర్షం కురుస్తున్నట్లు బాధపడతాను.

* * *

రెండు సంవత్సరాలక్రితం ఆ రాత్రి!....

కాటుకలా నల్లని మబ్బులు నింగిని ఆక్రమించుకొన్న రాత్రి-చెట్లను నేలగూల్చేలా ప్రచండవేగంతో గాలివీచిన రాత్రి-ఏనుగుతొండంలాంటి ధారలతో వర్షం కురిసినరాత్రి-ఆరాత్రి, నాకు బాగా జ్ఞాపకం.

గది తలుపులు బిగించి, కుర్చీలో కూర్చుని, కాళ్ళు టేబిలుమీద పెట్టి, సిగరెట్లు అగ్గిపుల్లల్ని వేస్టుచేయకుండా కాలుస్తూ-రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారి "మంచి చెడ్డలో ఏ కథ?" చదవటం పూర్తిచేసి, ఆలోచనలో పడ్డాను! ఆ కథలో రెండు భాగాలున్నాయి. మొదటిది 'మంచి!' రెండోది 'చెడ్డ!' ఆ రెండూ గొప్ప కథలే! ప్రతిమనిషిలోనూ ఆలోచనలు రేపుతాయి! "అయితే, ఆ రెండిటిలో మీకు ఏది ఎక్కువ ఇష్టమో చెప్తే మీ స్వభావం కొంతవరకూ

వెల్లడవుతుందని నా అభిప్రాయం" అంటూ చివరన ఒక పరీక్ష పెట్టారు రచయిత. ఎంతసేపు యోచించినా వాటిలో దేనిని నేను ఎక్కువ ఇష్టపడ్డానో తేల్చుకోలేకపోయాను! కాని ఇపుడు అనిపిస్తోంది. "వాటిలో నాకు రెండో భాగమే ఎక్కువగా నచ్చిందని!"

ఆ ఆత్మ పరీక్ష సమయంలో తలుపు దబదబా బాదిన చప్పుడయింది. లేచి వెళ్ళి తలుపు తీశాను. వర్షపుజల్లు ఒక్కసారి మొహాన కొట్టింది! ఆయాస పడుతూ తడిసి ముద్దయిన ఆకారం, జగన్నాథం గదిలోకి వచ్చేడు.

జగన్నాథం నాతోటి గుమాస్తా! ఒక్కసారి మీరు వాడిని చూస్తే "వీడు గుమాస్తా వెధవ!" అని పోల్చుకుంటారు. ఈ దేశంలో గుమాస్తాలు పడే బాధలన్నీ వాడి ముఖంలో గూడు కట్టుకొని వుంటాయి! జగన్నాథం చూడ టానికి చాలా బాధగా కన్పిస్తాడు. వాడి ముఖంలో మంచితనం కొట్టొచ్చినట్లు కనబడకపోయినా, జగన్నాథం అతి మంచివాడు! వాడి మంచితనం, నిజాయితీ ఈ రెండూ కలిసి వాణ్ణి అతి దారిద్ర్యావస్థకు తీసుకువెళ్ళాయి.

"ఇంత వర్షంలో ఇలా వచ్చావేమిటి?" అన్నాను.

"రాజూ! యాభయి రూపాయలు అర్జంటుగా కావాలి! నువ్వు సర్దగల వనే ఆశతో వచ్చాను! ఈ సాయం చేస్తే నీమేలు జన్మలో మరిచి పోలేను!" ఉద్వేగంతో అన్నాడు.

నాకు కొంత ఆశ్చర్యం కల్గిన మాటవాస్తవం!

"ఇంత రాత్రివేళ యాభయి రూపాయల అవుసరం వీడికేమిటి వచ్చింది" అనుకున్నా! నావద్ద నిజానికి డబ్బువుంది! మరుసటి దినం టెర్లిన్ చొక్కా కుట్టిద్దామని అనుకుంటున్నా, ఇపుడు ఈ డబ్బు ఇచ్చేస్తే మళ్ళీ అది తిరిగి రావటం కష్టం!

టెర్లిన్‌చొక్కా కుట్టించుకోవాలనే నా కోరిక కూడా ఇప్పట్లో మరి తీరదు! మనసు జగన్నాథానికి సాయం చేయటానికి ఒప్పుకోలేదు.

"నా వద్ద అయిదు రూపాయలు వున్నాయి. నేనూ నీ లాగ గుమాస్తా వెధవనేగా! అంత డబ్బు ఎక్కడ వుంటుందీ?" అని నిలువునా అబద్ధం ఆడేసి ఒక నవ్వు ముఖానికిపులుము కున్నాను.

జగన్నాథం ముఖంలో నిరాశ స్పష్టంగా తొంగిచూసింది.

"నీ దగ్గర వుంటుందనే ఆశతో వచ్చాను. ఏం చేస్తాం? మరోచోట ప్రయత్నిస్తాలే!" అంటూ తలుపు తీసుకొని తొందరగా అడుగులు వేసుకుంటూ వర్షంలోకి నడిచి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రంతా వర్షం కురుస్తూనే వుంది.

వర్షం కురిసినరాత్రి తెల్లవారింది!

వర్షపు వేగం తగ్గినా చినుకులుమాత్రం పడుతూనే వున్నాయి.

ఉదయం తొమ్మిదిగంటలకు "కోమలవిలాస్"లో భోజనం ముగించి ఆఫీసువైపు నడకసాగించాను.

రోడ్డు బురదగావుంది. మళ్ళీ పెద్దదవబోయే వర్షాన్ని సూచిస్తూ నింగిలో మబ్బులు ముసురుకుంటున్నాయి.

ఆఫీసుకు వెళ్ళేదారిలోనే జగన్నాధం ఇల్లు! అరుగుమీద స్తంభానికి జారగిలబడి కూర్చుని పిచ్చిగా శూన్యంలోకి చూస్తున్నాడు వాడు. నెలదినాల నుండి తిండిలేనివాడిలా అతి నీరసంగా వున్నాడు. వరండాలో అడుగుపెడుతూ అడిగాను. "ఏం జగన్నాధం! అలా కూర్చున్నావ్?"

నన్ను చూడగానే జగన్నాధం కంట్లో నీళ్లు చిప్పిల్లాయి.

"కూర్చోక ఏం చెయ్యను? నేను అసమర్థుణ్ణి. దరిద్రుణ్ణి! ఎందుకూ పనికిరానివాడిని! నాలాటి వాడిని భగవంతుడు ఎందుకు పుట్టిస్తాడు? లోకంలోని నిర్భాగ్యపు గుమాస్తాలందరూ కలిసి దేవుడిమీద తిరగబడితే ఎంత బాగుంటుంది?

మూడుదినాలనుండి నా భార్యకు జ్వరం! నిన్న సాయంత్రం పరిస్థితి మరీ విషమించింది. డాక్టరు నీరుకార్చేసి విశాఖపట్టణం పెద్ద ఆసుపత్రికి తీసుకు వెళ్ళిపొమ్మన్నాడు. నా దగ్గర చిల్లిగవ్వకూడా లేదు. ఎవరిదగ్గరా నయాపైసా కూడా అప్పు పుట్టలేదు. ఇంక అప్పు చెయ్యనక్కరలేదులే! దీన్ని వైజాగు తీసికెళ్ళనక్కరలేదు! పిడికెడు బుగ్గిజేస్తేచాలు! నా భార్య - నా దారిద్ర్యానికీ, అసమర్థతకూ బలిఅయిన భార్య - లోపల మంచంమీద అతి ప్రశాంతంగా నిద్రపోతోంది చూడు!"

మాటలు ఆపి బిగ్గరగా, విచిత్రంగా నవ్వుతున్నాడు జగన్నాథం. అలా నవ్వుతూవుంటే వాడిలోనుండి ఏదో భయంకరమైన భూతం వచ్చి నా జుట్టు పట్టుకొని పీకుతున్నట్లు అనిపించింది. నా గుండెల్లో దడ, కాళ్ళలో వణుకు ప్రారంభమయ్యాయి.

"నిన్నరాత్రి జగన్నాధానికి డబ్బుఇచ్చివుంటే....?" మరి ఆలోచించలేక పోయాను.

జేబులోని నోట్లు గొంగళీపురుగుల్లా మారి ఒంటిమీద పాకుతున్నట్లనిపించింది.

"ఈడబ్బువుంచు! తరువాతి పనులకు పనికివస్తాయి" అంటూ జేబులోని పురుగుల్లాటి నోట్లనుతీసి వాడిమీదకు విదిల్చాను.

బయట వర్షంతోబాటు నా మనసులోని బాధాగ్ని హెచ్చవుతోంది.

నాలోని కుటిలత్వాన్ని, స్వార్థాన్ని ఈ వర్షపునీరు కడగలేదు.

వర్షపుహోరు ఎవరో ఏడుస్తున్నట్లుంది.



# ఉచిత సలహాకోసం

అంపేరాయని చంద్రశేఖరరావు

గవర్నమెంట్ క్వార్టర్స్ దొరకటంతోటే ఆర్నెల్లనుంచీ ఊపిరి బిగపట్టుకుని కాపురమున్న అద్దెయిల్లు క్షణాలమీద ఖాళీచేసి, వెంటనే అందులోవచ్చి చేరిపోయాం. ఆలస్యమైతే మళ్ళా అదెవడు తన్నుకుపోతాడోనని ఒక నెలరోజులు గడిచి, అలా కొంచెం స్వేచ్ఛగా గాలి పీల్చుకున్నామో లేదో అక్కడ కొంచెం కష్టతరమయ్యేట్లే కనిపించింది. అన్ని వసతులు బాగానే ఉన్నాయి కాని, చిక్కంతా మా ఇరుగు పొరుగు వాళ్ళతోనే వచ్చింది.

చూడండి! లోకంలో అనేక రకాల వ్యక్తులుంటారు. వాళ్ళ ఇష్టాలూ, అయిష్టాలూ, అభిరుచులూ, అభినివేశాలూ రకరకాలుగా ఉంటాయి. కొందరికి సినిమాలంటే ఇష్టం. కొందరు క్రికెట్, హాకీ, ఫుట్‌బాల్ లాంటి ఆటలంటే ఇష్టపడతారు. కొందరు నృత్య ప్రదర్శనాలన్నా, నాటకాలన్నా మోజు చూపెడతారు. మరికొందరు సంగీతమంటే చెవికోసుకుంటారు. కొందరికి ప్రేమించడమంటే 'గులాబ్ జామ్' తిన్నట్టుగా ఉంటుంది. ఇలా ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్కదానిమీద 'ఇష్టం' చూపించడం సాధారణమే గాని, ఈ 'ఇష్టం' అనేది ఎక్కువైనపుడు దాన్నే 'పిచ్చి' అంటారు. ఎవరికైనా ఆయా విషయాల్లో ఈ ఇష్టం అనేది ఉండాల్సిన దానికంటే ఎక్కువైపోయి—'పిచ్చి'గా మారితే వాళ్ళనే 'సినిమా పిచ్చిగాళ్ళనీ' 'ఆటల పిచ్చిగాళ్ళనీ' 'నాటకాల పిచ్చిగాళ్ళనీ' 'ప్రేమ పిచ్చిగాళ్ళనీ' వర్ణిస్తుంటాం. నే నేదో మా ఇరుగు పొరుగు వాళ్ళ ముచ్చట చెప్పబోయి, లోకంమీద పడ్డానని కన్నెర్ర చెయ్యబోకండి. వాళ్ళ విషయానికే వస్తున్నాను.

ఈ లోకంలో అందరికీ అన్ని 'పిచ్చ'లూ ఉన్నట్టుగానే మా ఇరుగు పొరుగు వాళ్ళలోకూడా ఇద్దరు ముగ్గురు 'సంగీతం పిచ్చగాళ్లు' ఉన్నారు. అందువల్లనే వచ్చిందీ చిక్కంతా!

మా పక్కింటాయనకి శాస్త్రీయ సంగీతమంటే మహా ఇష్టం. అంచేతే ఆయన వాళ్ళ అమ్మాయిలిద్దరికీ సంగీతం చెప్పిస్తున్నాడు. మనువులు దొరక్క' ఇటు వాళ్ళకి కొంచెం కాలక్షేపంగానూ, అటు పెళ్ళికి అదనపు అర్హతగానూ ఉంటుందనే ఉద్దేశంతో ఆయన అలా కుమార్తెలిద్దరికీ సంగీతం చెప్పిస్తున్నా

డని లోకులు అనుకుంటారు. కాని నేను నమ్మను. ఆ శాస్త్రీయ సంగీతమంటే అయనకున్న అభిమానమే ఆయనచేత బలవంతంగా వాళ్ళిద్దరికీ సంగీతం చెప్పి స్తోందని నా నమ్మకం. కారణమేదైతేనేం. మొత్తానికి ఆయన వాళ్ళ అమ్మాయి లిద్దరికీ సంగీతం చెప్పిస్తున్నాడు.

ప్రొద్దుటిపూట కోకిల్లాంటి (రంగులో మాత్రమే) మ్యూజిక్ టీచర్ దగ్గర 'సంగీత శిక్షణ'కు రెండుగంటలూ, రాత్రిపూట (ఇదీ ఇరుగు పొరుగు వాళ్ళకు నిద్ర పట్టే సమయంలో) 'హోమ్ వర్క్'లాగా, ఆ అమ్మాయి లిద్దరూ కొనసాగించే 'సంగీత సాధన' మరో రెండుగంటలూ, వాళ్ళ దైనిక కార్యక్రమంలో తప్పనిసరి అయినవి. ఇరుగు పొరుగు వాళ్ళకి ఎంత విసుగ్గా ఉన్నా, సహించక మరోదారి లేకుండా ఉండిపోయినవి. పోనీ, ఆ సంగీత సాధన అయినా వినడానికి శ్రావ్యంగా ఏ కొంచెమున్నా రాగయుక్తంగా ఉంటుందా అంటే అదీలేదు. అయిదారు ఫ్యాక్టరీ సైరన్లు ఒకేసారి కూస్తున్నట్టుగా మొదటి నుంచీ చివరిదాకా ఒకటే మోత పుట్టిపోతుంది; చెవులు తూట్లుపడేలాగ. అందులో ఆదివారం సెలవైనా ఉంటే బాగుంటుందనుకుంటే ఆవిడ—అంటే ఆ అమ్మాయిల సంగీతం టీచరు, సెలవురోజుల్లో కూడ ప్రయివేట్ క్లాసులు పెడుతున్నట్టుగా వచ్చి, రెండుగంటలు సంగీతం చెప్పి మరీ వెడుతుంది. సరే ఇదిలా ఉంచండి.

ఎదురింటాయన ఉన్నాడు చూశారూ, ఆయనకు 'హిందీ ఫిల్మ్‌గీతాలు' (ముఖ్యంగా లతామంగేష్కర్ పాడినవి) అంటే ఇష్టం. ఆయన తెలివికి ఎంతైనా మెచ్చుకోవాలి. తనకున్న చిన్నసైజు రేడియో పక్కింటి అమ్మాయిల శాస్త్రీయ సంగీతంతో పోటీ పడలేక పోతుందని ఈ మధ్యనే పెద్ద (ఎకానమీ సైజు) రేడియో కొనుక్కొని వచ్చాడు. ఇహ వీలైనపుడల్లా (ముఖ్యంగా పక్కింటి అమ్మాయిలు సంగీతం సాధనచేసే సమయంలో) ఆ రేడియో మోగిస్తూం డడమే ఆయన ఏకైక లక్ష్యం.

ఇక వెనుకఇంటివారి విషయం: ఆఇంట్లో 'ఆవిడ' గురించి అందరికీ బాగా తెలుసు. కాని, 'ఆయన' గురించి అంతబాగా ఎవరికీ తెలియదు. ఆ ఇంట్లో ముఖ్యవ్యక్తి ఆవిడే। ఆ ఇంట్లోంచి కొట్టవచ్చినట్టుగా వినిపించే జోలపాటలు, మంగళ హారతులు, మేలు కొలుపులూ, తెలుగు సినిమా పాటలు వీటన్నిటినీబట్టి ఆవిడకి సంగీతమంటే 'ఇష్టం' పిచ్చిగా మారిందనే అనుకోవాలి. ముఖ్యంగా చెప్పాల్సింది ఆవిడకో 'పసిబిడ్డ' ఉన్న విషయం. ఆ పసిబిడ్డే

ఆమెకు సంగీతం అంటే ఉన్న అభిమానాన్ని ఇనుమడింప చేసిందని నా దృఢ విశ్వాసం. ఆ పసిబిడ్డ పూచికపుల్లలా ఉన్నా, ఇంటి పైకప్పు ఎగిరి పోయే టట్లు 24 గంటల్లో ముప్పాతిక మూడువంతులు ఏడుస్తూనే ఉంటుంది. ఆ పసి బిడ్డను ఊరుకోబెట్టడానికి ఈ మహాతల్లి జోలపాటలు పాడుతూ ఉంటుంది. జోలపాటలు పిల్లల్ని నిద్రబుచ్చటానిగ్గాను ఏర్పడినవి. కాని, ఈమె విష యంలో మాత్రం ఆ సిద్ధాంతం తల్లక్రిందులు చేసుకోవాలి మనం. ఒకవేళ పొరపాట్న ఆ పసిబిడ్డకు కునుకుపట్టినా, తల్లి పాడే జోలపాటకు ఆ పట్టిన నిద్రకాస్తా పటాపంచలయి ఆ బిడ్డ మేలుకుని కూచుంటుంది. ఇహ అక్కడి నుంచి ఒక పక్కనుంచి తల్లి పాడే పాట, మరోవేపునుంచి బిడ్డఏడుపు! అలాంటి సందర్భాల్లో పక్క ఇంటివాళ్ళ పరిస్థితి ఎలా ఉంటుందో చదువరుల ఊహ కందని విషయం కాదనుకుంటాను.

ఇలాంటి పరిస్థితుల్లో ఏంచేయాలా అన్నదే నన్ను వేధించే సమస్య! వీటన్నిటికీ ఓర్చుకుని చేతులు ముడుచుకుని కూచోవడమా? లేక ఒక కిరస నాయిలు డబ్బాతెచ్చి, వాళ్ళు చేసేదానికి ప్రతీకార సూచకంగా నేనూ వాయిస్తూ కూచోడమా? లేకపోతే కండబలం చూపించి వాళ్ళనోరు మూయించడమా? ఏమిటి చేయడం?

ఇరుగు పొరుగు వాళ్ళతో స్నేహ సుహృద్భావాలు పెంపొందించుకొని—'శాంతియుత సమజీవనం' చేయాలనే సదుద్దేశం కలవాళ్ళలో నేనొకణ్ణి! అంచేతనే మా ఇంటి పరిసరాల్లో ఏర్పడిన ఈ అవాంఛనీయమైన వాతావరణాన్ని శాంతి మార్గాల ద్వారానే పరిష్కరించుకోవాలని నిశ్చయించుకున్నాను. ప్రశాంత వాతావరణం భంగపరచి, ఒక్క నిమిషమైనా నిశ్చింతగా గడపడానికి వీల్లేని—పరిస్థితి ఉత్పన్నం కావడానికి వాళ్ళెలా కారకులవుతున్నారో ఆ విషయం వారికే ప్రార్థనాపూర్వకమైన లేఖలు వ్రాసి, తెలియజేయాలని నిర్ణయించుకున్నాను. నా నిర్ణయం ఆచరణలో పెట్టానని మీకు తెలియజేసేవే తు. చ. తప్పకుండా ఈ క్రింద పొందుపరుస్తున్న నా లేఖలు; వాటికి ప్రతిగా నాకు ఆ యావ్యక్తులు ఇచ్చిన జవాబులు.

* * *

ఆర్యా!

శాస్త్రీయ సంగీతమంటే విలువలేకుండా పోతున్న ఈ రోజుల్లో ఇంకా అదంటే అభిమానంచూపే మీలాంటి వ్యక్తులుండడం ఆనందించాల్సిన విషయం.

అందుతోనూ చక్కగా పాడగల ఇద్దరు కుమార్తెలు ఉన్నందుకు మీరెంతో అదృష్టవంతులయ్యారు. వారిలోని కళానైపుణ్యం గమనించి, దానికి మెరుగులు దిద్దడానికై మీరు మీ అమ్మాయిలకు తగిన శిక్షణ ఇప్పించడం మెచ్చుకోదగిన విషయం. కాని, ఒక్క సందేహం।

ఆ సంగీతం-టీచరు అమ్మాయిలచేత ఒకేసారి పాడించడంలో పెద్ద పొరపాటు చేస్తున్నదేమోనని, అన్నిటికంటే ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే-మీ ఇద్దరమ్మాయిల కంఠస్వరాలూ ఒకదానితో ఒకటి కలవ్వు అనే విషయం ఆవిడ తెలుసుకోలేక కలిసి పాడించడమనే కార్యక్రమం ఇంకా కొనసాగించడం. అయ్యో! ఇకనైనా ఈ రకమైన శిక్షణ మాన్పించండి. తర్వాత ఇంకొక్క మనవి. ఒక గది తలుపులు అన్నీ మూయించి, ఇకపై మీ అమ్మాయిల సంగీత శిక్షణ ఆ గదిలో ఏర్పాటు చేయించండి. ఎంచేతనంటే అలాంటి ఏర్పాటు జరిగేటట్లయితే చుట్టుప్రక్కల ఉండే నాలాంటివాళ్లు కొంచెం ప్రశాంతంగా జీవించడానికి అవకాశం ఉంటుంది. మరో చిన్న సలహా! గంటల కొద్దీ పొడిగించకుండా, 'శిక్షణ' కాలపరిమితికూడ కొంచెం తగ్గిస్తే మీ అమ్మాయిల ఆరోగ్యానిక్కూడా కొంత మంచిది.

ఇట్లు,

'............'

* * *

పై ఉత్తరానికి ఎలాంటి సమాధానం వచ్చిందో చూడండి—

మహాశయా!

మీ లేఖ అందింది. నేనంటే మీకుగల సదభిప్రాయం వెలువర్చినందుకు కృతజ్ఞుణ్ణి! అమ్మాయిలను మీరు ప్రశంసించినందుకు వాళ్లు మీకు 'థాంక్స్' చెప్పమన్నారు. ఈ టౌన్‌లో ఉత్తములుగా ప్రసిద్ధి గాంచినవారి చేతనే మా అమ్మాయిలకు 'శిక్షణ' ఇప్పిస్తున్నాను. అలాంటివారిలోనే మీరు తప్పులెన్నుతున్నారంటే మీ సంగీత పరిజ్ఞానాన్ని మేము శంకించవల్సి వస్తోంది. పైగా అలా అనడం వ్యక్తి దూషణక్రిందికి వస్తుందనీ, వ్యక్తిదూషణ నేరమనీ, మీరు గమనించాలి. ఇకపోతే వాయుదిగ్బంధన గదిలో మా అమ్మాయిలకు పాఠాలు చెప్పించమనడంలో మీ ఉద్దేశం? ఊపిరాడక చావమనేనా? మీ సలహాలకు చాలా కృతజ్ఞత. ఇలాంటి సలహాలు ఇకపై ఇవ్వవద్దని మనవి. ఇదికూడ

వినండి. ఇప్పుడున్న పరిస్థితుల్లో ఏమాత్రం కూడా మార్పులు తీసుకురావడ మనేది జరగబోదని మీరు గుర్తించాలి. సెలవ్ !

ఇట్లు,

'..........'

* * *

ఎదురింటివారికి వ్రాసిన లేఖ :

డియర్ మిస్టర్ !

విరామమనేదిలేకుండా మీరు మీ రేడియో 'ఆన్' చేసి ఉంచుతున్నప్పటికీ, అది చెడిపోకుండా ఎప్పటిలాగే ఉన్నదీ అంటే అదేదో మంచి సరుకే అయ్యుండాలి. తగినంత స్థాయిలో—ఇంట్లో ఉన్న నలుగురికీ వినిపించేలాగ, 'వాల్యూమ్' తగ్గించి పెట్టుకున్నట్లయితే—'రిసెప్షన్' బాగుంటుందని అందరికీ తెల్సిన విషయమే. అలా వాల్యూమ్ తగ్గించి పెట్టుకున్నట్లయితే మీ రేడియో బాగానూ ఉంటుంది, నాలాంటివాళ్ళ చెవులు బ్రద్దలవకుండానూ ఉంటాయి. సహృదయంతో నా బాధ అర్థం చేసుకోగలరని ఆశ !

ఇట్లు,

'..........'

పై లేఖకు వచ్చిన జవాబు చూడండి—

డియర్ ఔరంగజేబ్ !

నా రేడియోను మీరు మెచ్చుకున్నారు. ధన్యవాదాలు చెప్పాల్సిన అవసరం నాకేమీ కనపడ్డంలేదు. ఎంచేతనంటే రు. 750లు పెట్టి కొన్న నా రేడియోను మెడమీద తలవున్నవాడెవడైనా మెచ్చుకుంటాడు. అంతడబ్బు వెచ్చించి, మోజుపడి కొనుక్కున్న రేడియోను వినీ వినిపించకుండా మంద్రస్థాయిలో, వాల్యూమ్ కంట్రోల్‌చేసి పెట్టుకోవల్సిన అవసరం, అగత్యం నా కున్నట్లుగా ఏమీ కనిపించడంలేదు. రేడియో బిగ్గరగా పెట్టుకుని దగ్గరగా కూచుని వినడం నా కలవాటు. సంగీతం అలా వింటేనే కాని, నాకు విన్నట్టుండదు.

రేడియో పెట్టుకునే పద్ధతిలో మీరు చేసిన సూచనలు చూస్తే మీరు ఏ క్రీస్తు పూర్వంనాటి వ్యక్తిలాగానో కనపడుతున్నారు. సంగీతం అంటే మీకు ఇష్టం లేకపోతే అది కేవలం మీ దురదృష్టం. నేను సంగీతమంటే చెవి కోసుకుంటాను. కనుక నేను నా రేడియో పెట్టుకోక తప్పదు. అందువల్ల ఎవరికైనా

బాధగా ఉంటే నే చేసేదేమీలేదు. కాబట్టి ఒకరి సూచనల ప్రకారం నా మామూలు అలవాట్లలో మార్పు తెచ్చుకోవడం జరగబోదని మరీమరీ తెలియజేస్తున్నాను.

ఇట్లు,

'.........'

* * *

వెనుక-ఇంటివారికి వ్రాసినది:

ఆర్యా!

మీ పాపాయి పుట్టినప్పట్నుంచీ మీ శ్రీమతి కమ్మని కంఠంతో పాడే జోలపాటలు వినే అదృష్టం పట్టింది నాకు. 'జోలపాట' చిన్నపిల్లలు నిద్రపోయేందుకుగాను పాడతారని చిన్నప్పుడెప్పుడో విన్నాను. చిన్నపిల్లలు ఏడవకుండా చెయ్యటానిక్కూడా అవి ఉపయోగపడతాయని ఇప్పుడర్థమైంది.

కడుపులో ఏమన్నా బాధగా ఉంటే చిన్న పిల్లలు సాధారణంగా ఏడుస్తారు. అలాంటి బాధలు పిల్లలకు ఉంటే 'మందు' ఇస్తే తగ్గిపోతుంది. కనుక ఏడ్చే మీ పాపకు-'జోలపాటల'కు బదులు మందు ఏదైనా వాడమనీ, విన్నవాళ్ళకు తలనొప్పి పుట్టించే ఆ జోలపాటలు ఇకపై ఆపుచేయించమనీ సవినయంగా మనవి చేసుకుంటున్నాను. తప్పులేమన్నా ఉంటే ఆగ్రహించకండి. మందు సంగతి మర్చిపోరుకదూ! ఉంటాను. సెలవ్!

భవదీయ,

'.........'

* * *

పై ఉత్తరానికి జవాబు—

ఆర్యపుత్రా!

మీ గోడు నాకర్థమయింది. మీరు చెప్పేదానికీ, మా ఆవిడ వాళ్ళ అమ్మ, అమ్మమ్మలవద్ద నేర్చుకున్న విషయాలకూ ఎక్కడా పొసగటం లేదు. జోలపాటల విషయంలో మీ అభిప్రాయాలతో నేనూ ఏకీభవిస్తున్నాను. మీరు ఇచ్చిన అమూల్యమైన సలహాకు నా హృదయపూర్వక అభివందనాలు. కాని, పాపాయి పోషణ బాధ్యత యావత్తూ మా ఆవిడ అధీనంలోనే ఉందికనుక మీరిచ్చిన సలహాల్లో ఏ ఒక్కటికూడా ఆచరణలో పెట్టడానికి నాకు సాధ్యం కాదని చెప్పాల్సి వచ్చినందుకు చాలా విచారిస్తున్నాను. పాపాయి ఏడవటంవల్ల మీ

ప్రశాంత జీవితానికి అంతరాయం కల్గుతున్నట్లు మీరు వ్రాసిన వాక్యాల్లో తేట తెల్లమౌతోంది. మీకు ఇబ్బంది కల్గినందుకు నేనెంతగానో ఇదవుతున్నాను.

శిశు సంరక్షణ విషయంలోనూ—ముఖ్యంగా జోలపాటల విషయంలోనూ మీరు ఇచ్చిన సలహాలు ఆవిడతో చెప్పేసరికి 'భద్రకాళి' అవతారం ఎత్తినంత పని చేసింది. ఇంకా నయం! మీరు వ్రాసిన ఉత్తరం ఆవిడ చేతుల్లో పడ లేదుకనుక సరిపోయింది. అలా జరిగి ఉంటేనా! ఇంతకీ మీ కాలం బాగుంది. బైట పడిపోయారు. ఇహ ఎప్పుడూ అలాంటి ఉత్తరాలు వ్రాయబోకండి. అలా చేశారంటే మీ ఒంటికేమంత మంచిదికాదు. ఫ్రెండ్స్‌గానే విడిపోదాం బై! బై!

ఇట్లు,

'............'

*   *   *

పరిస్థితి అంతవరకూ వచ్చాక—'మౌనం కలహం నాస్తి' అన్నట్లుగా పలక్కుండా ఉండడమే మేలనిపించింది. మర్నాటినుంచీ ఎప్పటి పరిస్థితులే!

అమ్మాయిల సంగీతం సాగిపోతోంది.

రేడియో, వారితో పోటీ పడుతోంది.

బిడ్డ ఏడుపుతోపాటు తల్లి జోలపాటలూ వినపడుతున్నాయి.

అన్నిటికీ సహించక తప్పదు మరి. ఇటు అద్దె తక్కువలో అన్ని వసతులూ ఉన్న ఇల్లా వదల్లేం, అటు ఇరుగు పొరుగు—వాళ్ళ పోరూ భరించలేం. ఇలాంటి పరిస్థితుల్లో ఏం చేయాలో తోచడంలేదు. ఇదంతా చదివి సహృదయులైన పాఠకు లెవరయినా ఉచితసలహా ఇవ్వకపోతారా అన్న ఆశమాత్రం ఒక్కటి మిగిలి ఉంది. ఆ ఆశతో మీ సలహాకోసం ఎదురుచూస్తున్నాను. ఎవరైనా పంపిస్తే, కృతజ్ఞత తెలుపుకోగలను.



# మ. మే. ఫి.

దాడి వీరభద్రరావ్

నాగమయ్యగారికి ఊపిరిసలపనంతగా పని. యిటు తిరుగుతున్నాడు, అటు తిరుగుతున్నాడు, ప్రతి పనినీ తనే స్వయంగా చేసుకుంటున్నాడు. వాళ్ళ బ్బాయి పెళ్ళినాడయినా తను అలా కష్టపడలేదు నిజానికి. అవునుమరి–మహాకవిగారంటే అతనికంత మక్కువ. అందులోనూ యివాళ మహాకవిగారికి ఘన సన్మానం. యిక వేరేచెప్పాలా–ఓ! నాగమయ్యగారిదే అంతాను.

"అయితే నాగమయ్యగారూ–మందుగుండు పేల్చక తప్పదంటారా?" అన్న ఓ కుర్రాడిమీద మండుకొచ్చింది నాగమయ్యగారికి. "మహాకవిగారికి చెయ్యకచెయ్యక సన్మానం చేస్తుంటే మందుగుండు పేల్చక తప్పదా అంటావేఁవిటోయ్–అసలు మందుగుండు లేకపోతే సన్మానమేమిటి?"

"అవుననుకోండి, అంత ఖరీదైన మందుగుండు...."

"ఖర్చంతా నాది, ఎంత ఖరీదైనా ఖర్చుపెట్టి తీరతాను. యింతా ఖర్చుపెట్టి ఆ నాలుగొందల్కి కక్కుర్తిపడితే మన గొప్పతనమేమిటి, మనూరి ప్రఖ్యాతేమిటి?!" జారిపోకపోయినా ఒక్కసారి పంచెకట్టును ఊడదీసి, ఒక కాలును జాడించి, మళ్ళీ బిగించి కట్టాడు.

యింకెందుకని మనసులో ఉన్న అసలు మాటను చెప్పేశాడు కుర్రాడు, "అదికాదండి....అసలే తారాజువ్వలు! పూరిగుడిసెలమీద పడ్డాయంటే...."

"పోతాయోయ్–మహాకవికంటె గొప్పవేంటి మహా యీ పూరిగుడిసెలు?" అంటూ మళ్ళీ ఏదో చెప్పబోతున్న కుర్రాడివంక విసుక్కున్నాడు–"యిదో అబ్బాయ్, నువు కుర్రాడివి నీకేం తెలీదు–మమ్మల్నేం విసిగించక నీపని నువ్వు చూసుకో" అంటూ ముందుకు పోయాడు. అసలే అంతా అయోమయంగా వుంది. అయిదు గంటలకు సన్మానం! అప్పుడే చిన్నముల్లు నాలుగుమీద ఊగులాడుతోంది! సన్మానం ఎంత గొప్పగా అవుతుందిరా భగవంతుడా–సన్మానానికొచ్చే పెద్దపెద్దవాళ్ళనందర్నీ ఎలా గౌరవించాలా దేవుడా–ఎంత....ఒకటేఁవిటి–యిదంతా ఆలోచించలేక అసలే చస్తుంటే మధ్యలో యీ కుర్రవెధవలు కాళ్ళల్లో కర్రపెట్టినట్టు అడ్డంగా వస్తారు అనుకుంటూండగా, కరెంటబ్బాయి వగుర్చుకుంటూ పరుగెత్తుకొచ్చాడు "బాబుగారూ!" అంటూ.

వాడు మాటాడలేకపోతున్నాడు. నాగమయ్యగారు గాబరాపడిపోయారు. ఎవడి ప్రాణమయినా కరెంటుకంటుకుని ఎగిరిపోలేదు గదా_అసలే చెయ్యక చెయ్యక సన్మానం! "ఏఁవయిందిరా?"

"లైట్లు వెలిగిస్తేచాలు బాబూ ఫీజు లెగిరిపోతున్నాయ్!"

'చంపావురా వెధవ! ఫీజు లెగిరిపోతే ప్రాణాలెగిరిపోతున్నట్టు గాబరా పడిపోతావేమిట్రా!' పైకి తిట్టలేదు_సన్మానం మధ్యలో ఏ వైరునైనా యిటు పెట్టేదాన్ని అటు పెట్టాడంటే_అసలే చెయ్యకచెయ్యక సన్మానం!

"గుళ్ళోనుండొచ్చే కరెంటు స్టేజిమీద లైటింగుకే చాలదు బాబూ!"

"మరెలాగరా? యింతా ఖర్చుపెట్టి సిటీనుండి లైటింగు తెప్పిస్తే యిదో గొడవ, ఛి! ఛి!"

"అంతమాత్రానికే బెంబేలెక్కి_పోతే యిక నువ్వేం పనికొస్తావయ్యా నాగవఁయ్యా!_గుడిపక్క_ అనుకునే నా యిల్లుందిగదా_నా యింట్లోంచే కరెంటు తీసుకోవయ్యా!"అన్న మునసబుగారి మాటతో కరెంటబ్బాయి జీరోబల్బు మొహం ఒక్క_సారి వెలిగి ఆరిపోయిన వెయ్యికేండిల్స్ బల్బులా వెలిగింది.

"రక్షించావయ్యా మునసబూ_ఆ! యిదిగో మునసబూ, కరెంటు అనవసరంగా యిచ్చేస్తున్నానే అని బాధపడేవు సుమా_యీ నెల బిల్లు ఎంతయితే అంతా నాకు పంపించు నేను కట్టేస్తాను" నవ్వుతూ ఓ నిజాన్ని చెప్పేశాడు నాగమయ్య.

మునసబు మొహం ఓ పట్టు వెలిగిందిగాని మళ్ళీ యిట్టే అట్టిపెట్టేశాడు_ "నీ యింట్లో పెళ్ళికయితే నాయింట్లో కరెంటు యివ్వాయివ్వను, యిచ్చినా నువ్వనకముందే బిల్లును కట్టేసి నీ ముఖానకొట్టి పడేస్తాను. యిదేఁవన్నా నీ పెళ్ళా, నీ యింట్లోపెళ్ళా?! మహాకవిని తీసుకొచ్చి ఊరంతటి తరఫునా బ్రహ్మాండఁవైన సన్మానం జేయిస్తుంటే, ఊరి మునసబును నాకుమాత్రం గర్వం గాదటయ్యా?" మునసబు మాట్లాడుతూంటే కరెంటబ్బాయింకా అక్క_డే ఉన్నాడు.

"యేరా, నువ్వింకా యిక్క_డే వున్నావు?" నాగమయ్య ఉరిమాడు.

"అదికాదు బాబూ_స్టేజిమీద లైటింగుకి గుళ్ళోంచి కరెంటు తీస్తాను, మైకులన్నింటికి మునసబుగారింట్లోంచి....మరి మైదానంలో లైటింగుకి మీ యింటిదగ్గర కరెంటు...."

నసుగుతున్న కుర్రాడిని కసిరికొట్టాడు నాగమయ్య. "మా యింటి దగ్గర కరెంటుకి నన్నడగాలట్రా పెర్రి వె....యింకా చూస్తావేం పరిగెత్తు ముందు."

పారిపోతున్న కర్రాణ్ణి చూస్తూ మునసబు అన్నాడు. "కాని నాగమయ్యా, వేలకు వేలు ఖర్చుపెట్టేసి యింత గొప్పగా సన్మానం జేసేస్తున్నావ్— నీ జన్మే జన్మయ్యా—వెధవ బ్రతుకులు మావీ ఓ బ్రతుకులేనా! ఒక్క వెధవకి సన్మానం చెయ్యలేకపోయాం...." మునసబుగారి మాటలకి నాగమయ్య మీసం మరింత దుబ్బుగా అయిపోయింది. దాన్ని నెమ్మదిగా మెలితిప్పుతూ స్టేజివైపు బయల్దేరాడు.

"నాగమయ్యా—నీలో యింతుంచుకుని కూడా నువ్వు పనికి రాకుండా పోవడం వూరికి అన్యాయం చేస్తున్నట్టేనోయ్—యీ సారి నువు తప్పకుండా పోటీ చెయ్యాలి. నువ్వు నిలబడు బొమ్మలాగ, నీ పేరు చాలయ్యా—నీ పేరు పెట్టుకుని తోకల్లా పని జేసేవాళ్ళం మేం వున్నాం, నీకెందుకయ్యా నువ్వు నిలబడు."

"నాకెందుకు మునసబూ యీ పనికిమాలిన పదవులూ, మొయ్యలేని బరువులూను? ఏదో యిలా రామా కృష్ణా అంటూ నాకు చేతనయిన మంచి పనేదో చేస్తున్నానుగదా—నన్నిలా బ్రతకనియ్యండి చాలు."

"అమమ్మ. నువ్వంత మాటంటే...." స్టేజి దగ్గరకొచ్చేసింది యిక మాటలు పొడిగించకూడదు. "అవునుగాని నాగమయ్యా, యీ మహానుభావుడు మహాకవిగారిని గురించి నేనెన్నాళ్ళనించో అనుకుంటున్నాను సుమా మాటాడదామని—ఆరోజేదో రానేవచ్చింది నీ పుణ్యమా అని—స్టేజిమీద నాకో సీటు వేసావంటే...."

"చూద్దాం".

మునసబు మొఖంమీద జల్లుమని పేడనీళ్ళు చల్లినట్టయింది. అయినా సిగ్గుపడలేదు—"చూద్దావంటే కాదు మరి, యివాళ నువ్వే యిలా అంటే రేపు యింకొకరైనా...." మునసబు మాటను మధ్యలోనే ఆపేశాడు నాగమయ్య.

"మహాకవిగారిని అడిగి చెప్తానయ్యా! మరి—మునసబులు, గినసబులు మనకుగొప్ప గాని వాళ్ళకు లెక్కా? జమా! అడిగి చూస్తాను వారొప్పుకుంటే నాకేం—నువ్వు కూచుంటే ఒకటీ నేనుకూచుంటే ఒకటీనా స్టేజిమీద? మరివుండు అప్పుడే నాలుగున్నరైపోతోంది. మహాకవిగారొచ్చేస్తే...." 'మునసబులు—గినసబులు—బులు— లెక్కా జమా—జమా—వారొప్పుకుంటే—టే—మరి వుండ—వుండ—చ్చేస్తే—స్తే....'

నాగమయ్య యేం చెబుతున్నాడో మునసబుకింక అక్కర్లేదు. 'నీ తస్సా

దియ్యా—నీబాబులాంటి సన్మానం నేనూ జేస్తానుంట్రా. యివాళ నేను మైదానంలోకైనా వచ్చానుగాని ఆవేళ నిన్ను మైదానంలోకి కూడా రాకుండా జేసేస్తాను—యీ మునసబంటే ఏమనుకున్నావో. యిన్నాళ్ళూ మొద్దులా పడున్నానా! యిక చూడు ముందుముందు యీ మునసబంటే ఏఁమిటో!'

నాగమయ్య కాలుగాలిన పిల్లిలా వెర్రెక్కిపోతున్నాడు. అప్పుడే నాలుగున్నరై పోయింది, యింకా మహాకవిగారూ రాలేదు, ఎవరూ రాలేదు— జనం విపరీతంగా వచ్చి పడిపోతున్నారు! ఎక్కడెక్కడున్న పోలీసువాళ్ళూ లాఠీకర్రలు పట్టుకుని రోడ్లమీద బారులుతీర్చి నిలబడిపోతున్నారు. ఊర్లో ఉన్న పెద్దలు, ఊరిపక్క పెద్దలూ అంతా ఓగంట ముందుగానే వచ్చేసి ఎదురు చూస్తున్నారు గుంపులుగుంపులుగా నిలబడి.

"కవిగారింకా రాలేదాండి?" మళ్ళీ వచ్చిన యిందాకటి కుర్రాడి మీద మళ్ళీ మండుకొచ్చింది నాగమయ్యకు. "కవిగారు రాలేదనేగదా అందరం ఎదురు జూస్తున్నాం? నేనేం దాచిపెట్టి నాటకమాడుతున్నాననుకుంటున్నావా? చెప్పలేక చస్తున్నాను—శుభ్రంగా టిక్కెట్టుబెట్టేస్తే ప్రాణం హాయిగా వుండేది."

దూరంనుండి కోలాహలం....గోల....జనం పరుగెడుతున్నారు ముందుకి. "వచ్చేస్తున్నారు." "అదిగో కారు" "వచ్చేస్తున్నారు" పెద్దలంతా ముందుకు పోతున్నారు.

పోలీసులు లాఠీలను గాలిలో తిప్పుతూ హంగు చేస్తున్నారు.

"జై" "జిందాబాద్" "వర్ధిల్లాలి" అరుపుల్లో, జేజేలలో నాగమయ్య కంగారెత్తిపోయాడు!

మునసబు ఒళ్ళంతా నీరుగారిపోతోంది. ఎవరోతెచ్చి నాగమయ్య చేతిలో రెండు దండలుంచారు. పక్కకు చేరిన మునసబు చేతిలో ఒక దండను ఉంచబోయి మళ్ళీ ఎందుచేతనో గబుక్కున లాక్కుని తన చేతిలోనే ఉంచేసుకున్నాడు. కసిగా పరుగెత్తాడు మునసబు దండను సంపాదించడానికి.

కారు దగ్గరకొచ్చేసింది.

"ఆపాలీ" "నాగమయ్యగారున్నారూ...." "ఆపాలీ."

కారు ఆగిపోయింది.

కారుచుట్టూ పోలీసులు—పోలీసుల చుట్టూ జనం—జనం చుట్టూ పోలీసులు. జనాన్ని పక్కకు నెట్టుతూ నాగమయ్యకు తోవ యిస్తున్నారు పోలీసువాళ్ళు.

కారుచుట్టూ మనుషులు-అందరి చేతుల్లోనూ దండలు. చేతిలో దండను రెడీగా పట్టుకుని కారు దగ్గరకి చేరాడు నాగమయ్య.

కారుడోర్ తెరుచుకుంది. కానీ నాగమయ్య నోరు పెగల్లేదు.

"గౌరవనీయులైన శ్రీశ్రీశ్రీ ప్రభుపులవారికీ...." "జై!" కొట్టారు చేతుల్లో దండలున్నవారంతా.

కారులోంచి ఎవరో దిగారు! అతనికి పడలేదీదండలు! కారులోకి యింకా దూరిపోయాయి అందరికళ్ళూ.

గుండెలు గుభిల్లుమన్నాయి. దండలు పట్టుకున్న చేతులు, కాళ్ల వణకడం మొదలు పెట్టాయి. ఏరి? ఏరి? ఏరి!

"యిదిగో-వీరే మహాకవిగారు" అంటూ అదే కుర్రాడు నాగమయ్య చేతిలోని దండను తీసుకుని మహాకవి మెళ్ళోవేసి, "మహాకవిగారికీ జై" అన్నాడు అతనికి జై అన్నవాళ్ల కారుప్రక్కనలేదు-దూరాన వున్నారు.

నాగమయ్య గొంతులోంచి మాట నెమ్మదిగా పెగిలింది-"మంత్రిగారు ఏరి?"

"మంత్రిగారి మేనగోడలికి ఫిట్స్ అట-రాలేకపోయారు." "మంత్రిగారి మేనగోడలికి ఫిట్స్ అట!

"పాపం మంత్రిగారి మేనగోడలికి ఫిట్స్ అట?!" "అయ్యయ్యో మంత్రిగారి మేనగోడలికి ఫిట్స్ అట!"

ఎవరి చేతిలోవున్నదండలు వారి చేతుల్లోనే వాడిపోతున్నాయి.

కారుకు దూరంగా మాత్రం వినిపిస్తున్నాయి. "మహాకవిగారికీ జై!" "మహాకవీ జిందాబాద్!" "మహాకవీ వర్ధిల్లాలి!"

ధన్ ధన్ ధనాధన్ ధన్! జర్ జర్ మని జువ్వలు ఎగిరి పేలుతున్నాయి.

నాగమయ్య గుండె పగిలిపోయింది, "ఎవడ్రా అది? ముందాకాల్చడం ఆపేసి మందుగుండును దుకాణాని కిచ్చెయ్యమను. అసలే పూరిగుడిసెలు" గట్టిగా అరిచాడు.

ముందు నాగమయ్య, వెనక మునసబు, ఆ వెనుక మహాకవి, ఆ వెనక అదే కుర్రాడు, ఆ వెనుక....అలా నడుస్తున్నారు స్టేజీవైపు. కళ్ళు జిగేలుమన్నాయి. స్టేజిమీదా, మైదానంలోనూ లైట్లు వెలిగిపోతున్నాయి.

మునసబు గుండె బాదేసుకున్నాడు.

ఆ కుర్రాడు ముందుకొచ్చి అడిగాడు నాగమయ్యను, "మరి మీరు అధ్యక్షత వహిస్తారా సభకు?" "అమ్మమ్మ. నేను మాత్రం కూచోను. అవతల మంత్రిగారి మేనగోడలికి ఫిట్సు వస్తే యివతల మహాకవికి సన్మానం జేస్తూ స్టేజీమీద ఎలా కూచోగలను? యిదిగో, మునసబు కూచుంటాడు — కాస్త మాటాడగలడుకూడా."

"నా కొద్దుబాబూ ఆ స్టేజిమీద సీటు. నాకసలే.... నాకసలే ఒంట్లో బాగు లేదు. వస్తానుండండి—కరెంటు కాలిపోతున్నది—ముందు మెయినాపెయ్యాలి" పరిగెత్తాడు మునసబు.

"ఇదో మునసబూ, ఆ తోవనే కాస్త అలా వెళ్ళి, మా మెయినూ ఆపెయ్—అసలే మా కరెంటు వీకు" అరిచాడు నాగమయ్య.

"మంత్రిగారి మేనగోడలికి ఫిట్స్ అట!" "రైలుకు టైమయిపోయింది మరి?" "కార్లో పోదాం."

దండలు పట్టుకున్నవాళ్ళు ఒక్కొక్కళ్ళు జారి పోతున్నారు. పోలీసు జీపులు దుమ్ము రేపుకుంటూ దూసుకుపోతున్నాయి.

"నాగమయ్యగారూ!....నాగమయ్యగారూ!" ఆ కుర్రాడు మళ్ళీ నాగమయ్యగారి కోసం వెతుకుతున్నాడు.

యింకెక్కడ నాగమయ్య? మ. మే. ఫి.! 'మ'ంత్రిగారి 'మే'నగోడలికి 'ఫి'ట్సు! యిక్కడెలా వుంటాడు?

కవిగారి సన్మానసభకి అధ్యక్షులెవరు మరి!

పాపం—ఆ కుర్రాడే ముందుకు నడిచాడు. మందుగుండు పేలుడు వినిపించ లేదు. కరెంటు మెరుపులు కనిపించలేదు.



# ఆకలి

## కుమారి ఆలేటి నాగమణి

రాఘవకు కడుపులో గాబరాగా అన్పించింది. మూసుకుపోతున్న కనురెప్పలను బలవంతంగా తెరచి చూశాడు. కళ్ళకేమీ కన్పించడంలేదు. గది అంతా చీకటి ఆక్రమించుకుంది.

కడుపులోని గాబరా తగ్గడానికి కనీసం మంచినీళ్ళైనా మందుగా పోద్దామంటే ఆ చీకట్లో, కూజా ఎక్కడుందో కనుక్కోవడం కష్టం. గది అంతా వెతికే ఓపిక తనలో లేనట్టే శరీరం గాలిలో తేలిపోతున్నట్టుగా అన్పించడంతో, గది తలుపు వరకు తడుముకుంటూ, దొర్లుతూ వెళ్ళి తలుపు తెరిచాడు రాఘవ.

చల్లగాలితోపాటు చిరువెలుగు గదిలోకి వచ్చింది. చెమటతో తడిసిపోయిన శరీరాన్ని జాలిగా నిమిరింది గాలి. రాఘవకు హాయిగా అన్పించింది. కాసేపలా వుండిపోయి, మెల్లిగా కళ్ళుతెరిచాడు. మసకమసకగా వుండి కళ్ళకేమీ కన్పించడంలేదు. అయినా లేని ఓపిక తెచ్చుకొని లేచి తలుపుకు జారగిలబడి, కాళ్ళు బార్లాచాపి కూర్చొని కళ్లు మూసుకున్నాడు రాఘవ.

తన శరీరంలో అణువణువులో ఆక్రమించుకున్న ఆకలిలా, గదిలో ఆక్రమించిన చీకటిని, తలుపుతీసి కాసింత చీకటికిబదులు వెలుగునింపాడుకాని తన ఆకలినోరు మూయించలేక, అరిచే పేవులను ఓదార్చలేక, ఆకలి రాక్షసి గొంతును ఒక్కసారి ఆపలేకపోతున్నాడు. ప్చ్.... రాఘవ కళ్ళలో నుండి నీళ్లు జలజలా రాలాయి.

"ఛ.... వెధవాకలి ప్రాణం తినేస్తోంది" అనుకుంటూ నిస్సత్తువుగా అంత వరకు పొట్టనదిమిపెట్టిన కుడిచేతిని క్రిందికి వాల్చటంతో చేతికి తడిగా తగలడంతో ఉలిక్కిపడ్డాడు. "కూజాకు చిల్లి వుండడం నిజంగా తన అదృష్టం" అనుకుంటూ చేయినిచాచి కూజానందుకున్నాడు రాఘవ.

మొహమ్మీద కాసిని నీళ్లు చల్లుకొని, కడుపునిండా నీళ్లుతాగాడు. చిల్లిలో నుండి కారిపోగా మిగిలిన నీళ్ళు రాఘవకు తృప్తికలిగించాయి.

హమ్మయ్యా! అనుకుంటూ నిట్టూర్చాడు రాఘవ.

కాని అంతలోనే గట్టిగా త్రేన్పురావడంలో తాగిననీళ్లు నోట్లోకొచ్చాయి

రాఘవకు. నిస్సత్తువగా మెడ వాల్చేశాడు రాఘవ. కడుపులోకెళ్ళిన నీళ్ళన్నీ సమ్మె చేసినట్టు బయటికొచ్చేసాయి. వెర్రిగా నవ్వుకున్నాడు రాఘవ.

మళ్ళీ కడుపులో రొద మొదలైంది. రాఘవ విననట్టు అలాగే గుమ్మంలో పడుకొని, మోకాళ్ళను మరింత పొట్టలోకి ముడుచుకున్నాడు. బారెడు మనిషి జానెడైనా కడుపులో అలజడి తగ్గలేదు.

అరుస్తోన్న ఆకలికి బదులివ్వలేక నిర్విరామంగా వర్షిస్తున్నాయ్ అతని కళ్ళు. ఒక్కో కన్నీటిచుక్క ఒక్కో విషయాన్ని, ఆకలికి వివరించి విన్నవిస్తున్నా. ఆకలి యింకా యింకా విజృంభిస్తోందే తప్ప ఆ కన్నీటి బిందువులు చెప్పేదేదీ విన్పించుకోవడంలేదు. తనకున్న శక్తినంతా వినియోగించి రాఘవ మీద దాడి చేస్తోంది. క్షణక్షణానికి నీరసం, నిస్సత్తువ రాఘవను ఆక్రమించుకో సాగాయి.

"అమ్మా!" బాధగా మూలిగాడు రాఘవ.

అది మూలుగు కాదు. ఆర్తనాదం. ఆ ఆర్తనాదంవినే స్థితిలో ఎవ్వరూ లేరు. పరిసరాల్లోని మనుషులందరూ, హాయిగా నిద్రపోతున్నారు.

ఆ చుట్టుప్రక్కల్లోని వారంతా ధనవంతులూ, కడుపులోనిచల్ల కదలకుండా కూర్చునేవారూ కాదు. కూలిపోయిన గోడలమధ్య, విరిగిపోయిన తలుపులతో సగం నీడనిచ్చే యిళ్ళలో, గుండెలోని తలపుల, ఆశల, కోర్కెల పీకలు నులిమి చంపేసి, సగం చచ్చి సగం బ్రతికేస్తున్న మనుషులు. అయినా వాళ్ళంతా అర్ధాకలితో తప్ప, కడుపు ఖాళీగా సామాన్యంగా ఎప్పుడూ పడుకోరు.

వాళ్ళంతా కూలి నాలి చేసుకునే మనుషులు. పెళ్ళాం పిల్లలకోసం, ముసలి తల్లిదండ్రులకోసం వొళ్ళువంచి పనిచేసేవాళ్లు.

ఆ కూలికూడా దొరకని రోజుల్లో, అడుక్కునే మిషమీద బయలుదేరి, కనుమరుగుపడ్డ ఏ వస్తువైనా, యింటివాళ్ళకు తెలీకుండా తీసుకొచ్చేసి అమ్ముకు తిని బ్రతుకుతుంటారు. యిక ఆడవాళ్లు అంట్లుతోమి సంపాదిస్తారు. అందుకే వాళ్ళకు ఒంటినిండా బట్టలు లేకున్నా, కంటినిండా నిద్రపోతారు.

తెల్లవారితే ఎవరి కష్టాలు, బాధలు వారికి. ఆకలేస్తే అరుస్తారు, ఒకరి నొకరు మోసం చేసుకుంటారు, తిట్టుకుంటారు, వీలైతే కొట్టుకుంటారు. వాళ్లు పనిచేయకున్నా, రోజుకు ఒక్క పూటైనా కడుపునింపుకునే తెలివి సామర్థ్యం నాకున్నాయ్.

కాని....రాఘవ....రాఘవకు ఆ తెలివితేటలు సామర్థ్యం లేవు. అలా

లేకుండా పోవడానికి, చచ్చిపోయిన రాఘవ తల్లే కారణం కావచ్చు-లేదా రాఘవ పిరికి మనస్తత్వమే కావచ్చు, కాక.... రాఘవకు లౌక్యం తెలియకపోవచ్చు.

కాకుంటే-అంట్లు తోముతూ. అష్టకష్టాలుపడుతూ, రాఘవను చదివించాలనే ప్రయత్నంలోనే, రక్తాన్ని చెమటగా చేస్తూ, ఆఖరికి అలసి, సొలసి రాఘవను వొదిలేసి వెళ్ళిపోతూ—

"రాఘవా! దొంగతనం మహాపాపం నాయనా! దొంగతనంచేసే మీ అయ్య జైలుకెళ్ళి, అక్కడే చచ్చిపోయాడు. నువ్వలా కాకూడదనే యిన్నాళ్ళూ నేను నీకోసం బ్రతికాను. కాని.... నాలో సత్తువ నన్ను మోసం చేస్తోందిరా. నే వెళ్ళిపోయాకా, కూలి చేసి బ్రతుకు, సిగ్గుపడకు. కష్టపడి బ్రతకడంలో తృప్తి, ఆనందం వుంటాయేతప్ప సిగ్గుపడాల్సిన అవసరం వుండదు. నీ వొంట్లో సత్తువ వున్నంతవరకూ కష్టపడి బ్రతకడానికే ప్రయత్నించు. ఒకరిమీద ఆధారపడకు. నీ బరువు నీవు మోయలేనినాడు మరెవ్వరూ మోయలేరన్న విషయం గుర్తుకుతెచ్చుకో. అడుక్కు-తినడం అంటే నిన్ను నువ్వు వంచించుకొని కించపరచుకోపడమే. నీ నరాల్లో బలం లేనినాడు, నీ కీళ్ళలో శక్తి తగ్గిన్నాడు నువ్వు అడుక్కు-తింటే లోకం జాలిచూపిస్తుంది కాని.... నీలో శక్తి వున్నప్పుడు మాత్రం ఆశక్తిని ఖర్చుపెట్టి కడుపునింపుకో."

అన్న తల్లి చివరిమాటలు రాఘవకు గుర్తున్నాయ్. అందుకే అతడింతవరకు, శక్తి ఖర్చుపెట్టి వచ్చిన ఫలితంతో కడుపు నింపుకుంటున్నాడు.

కాని.... సరిగ్గా రెండురోజులనుండి, కాళ్ళరిగేలా తిరిగినా రాఘవకు ఎక్కడా పని దొరకలేదు.

ఎనిమిదవ తరగతి ప్యాసయిన రాఘవకు, ఏదో పెద్ద ఉద్యోగం దొరకాలన్న ఆశ, తపనా లేవు. చదివిన చదువువిషయం మరచి, కిరాణా దుకాణాల్లో, రైల్వేస్టేషను దగ్గర, బస్సు స్టాపుల దగ్గరా నిలబడి, "కూలి" అని పిలిచే కేకకు, పిలుపుకు ఎదురు చూస్తూ అర్ధో, రూపాయో సంపాదించి కడుపునింపుకునే రాఘవ రెండురోజులుగా ఏకూలీ దొరక్క-, మూడోరోజు అసలు యింట్లో నుండి కదల్లేక నిస్సత్తువుగా పడుకొని ఉన్నాడు.

డిగ్రీలు పొందినవాళ్ళే ఉద్యోగాలు దొరక్క- ఊడ్చేపనికి సిద్ధమౌతున్నారని పేపర్లలో చదివి ఎవరో అనుకోగా విన్న రాఘవ పెర్రిగా నవ్వుకున్నాడు. పిచ్చివాడిలా ఏడ్చాడు. తనకు కూలి దొరకలేదంటే ఆశ్చర్యపడే అవసరం కన్పించలేదు. అందుకే పిచ్చివాడిలా ఏడ్చి, వెర్రివాడిలా నవ్వాడు రాఘవ.

"ఏయ్! నన్ను మర్చిపోయావా? వీల్లేదు. నన్ను నువ్వు మర్చిపోతే మాత్రం నేను నిన్ను మరచిపోను." ఆకలి గర్జించింది.

రాఘవ బ్రతిమలాడాడు. కన్నీళ్లు కార్చాడు. తన బలహీనతలు చెప్పుకున్నాడు.

"వీల్లేదు. నీ బలహీనతలు పాతెయ్! ముందు నా ఆవేశాన్ని చల్లార్చు. ఆ తరువాత నీ బలహీనతలు తిరిగి త్రవ్వితెచ్చుకో. మీ అమ్మచెప్పిన మాటలు గుండెలమీద రాసుకో! నీ యిష్టం." ఆకలి శాసించింది.

రాఘవ కూజాలో నీళ్ళకోసం వెతికాడు. ఒక్క గుక్కెడు మిగిలాయి తాగ్రి, మెల్లిగా లేచి నిలబడ్డాడు. తాగ్రినవాడిలా తూలుతూ, సోలుతూ, అడుగులువేస్తూ యిల్లువదలి ఎంతోదూరం వచ్చాడు రాఘవ.

దూరానా సంగీతపు హోరు, లౌడ్‌స్పీకర్‌లోంచి వినవస్తోంది. ఎవరిదో పెళ్ళి.... రాఘవ పెళ్ళియింటికి దగ్గరగా వెళ్ళాడు.

ఆ రాత్రివేళ, చీకటిని తరిమే వెలుగులో, భోజనశాలమీద కూర్చున్న మనుషులమధ్య ఆత్రంగా తింటున్న ఆమె....ఆమెను చూస్తూనే ఉలిక్కిపడ్డాడు. తన గది కవతల, తడికెలు అల్లే గవరయ్యపెళ్ళాం. కొత్తచీర కట్టుకొని, వాళ్ళమధ్య కూర్చొని....

ఆమెను చూస్తూ నిలబడ్డాడు రాఘవ. మనసులో సుళ్ళుతిరుగుతోన్న ఆలోచనలు. ఆ ఆలోచనలకు రూపం ఇవ్వాలనుకునే మనసును బలపరుస్తూ శరీరంలోని అణువణువులో వస్తున్న చైతన్యం రాఘవ ఉత్సాహంగా వెనక్కి తిరిగాడు.

వరండామీద ఉతికి ఆరవేసిన బట్టలవంక రెండుక్షణాలు చూసి, మెల్లిగా గోడదూకి వెళ్ళాడు రాఘవ. మరో రెండునిమిషాల్లో రోడ్డుమీదికొచ్చాడు.

తను దొంగతనం చేసాడా?

లేదు. లేదు. మరోగంటలో ఆ బట్టలు తెచ్చి తిరిగి యధాస్థానంలో పెట్టేస్తాడు. రాఘవ తననుతానే సముదాయించుకొని, ఎదురుతిరుగుతోన్న అంతరాత్మను మెప్పించి, చిరిగి మాసిన తన బట్టలను మూటలాచుట్టి, తెచ్చిన బట్టలు వేసుకొని గబగబా ముందుకు కదిలాడు. చేతిలోని మూట ఓ చెట్టుదగ్గర రాయి క్రింద భద్రంగాపెట్టి, పెళ్ళివారిల్లు చేరుకున్నాడు.

మరో బంతి భోజనానికి కూర్చుంటోంది. రాఘవ గుండె గుప్పిట్లో ఇముడ్చుకొని కూర్చున్నాడు.

"ఎవరైనా ఏమైనా అడుగుతారేమో! ఎవరైనా గుర్తిస్తారేమో!" భయంగా తలవాల్చుకున్న రాఘవ, విస్తరి ఎంతకూ వేయకపోవడంతో మెల్లిగా తలెత్తి చూసాడు.

"హమ్మయ్య! విస్తరి వేసేఅతను వస్తున్నాడు." తల వాల్చుకున్న రాఘవ ముందు విస్తరి.

విస్తట్లో నిండుగా అన్నం. యింకా ఏమిటేమిటో, విస్తరి పూర్తిగా నిండిపోయింది. అలాగే నిండిన విస్తరివంక కళ్ళప్పగించి చూస్తున్న రాఘవ, "తినండి" అన్న ప్రక్కవారి మాటలకు ఉలిక్కిపడి తలెత్తాడు. దూరంగా తననే ఆశ్చర్యంగా చూస్తున్న గవరయ్యపెళ్ళాం! భయంతో వణికిపోయాడు. ఏదో ఆవేశం వెన్నుతట్టింది.

రాఘవ రెండుచేతులతో విస్తరిని పట్టుకొని హఠాత్తుగాలేచి నిలబడి పిచ్చివాడిలా పరిగెత్తడం చూసి బిత్తరపోయారంతా. రాఘవ ఎవరో తరుముతున్నట్టుగా, వేగంగా, వెనక్కితిరిగి చూడకుండా పరిగెత్తి, పరిగెత్తి ఆగిపోయాడు. రాయికింద భద్రంగా దాచిన తన చిరిగిన బట్టలు వేసుకొని చొక్కావొళ్ళో విస్తరి దాచి, కడుపుకు ఎడమచేత్తో అదుముకొని, కొన్ని నిమిషాల క్రితం, తను తీసుకుపోయిన బట్టలు ఉండగాచుట్టి, గోడమీదనుండి వరండాపైకి విసిరేసాడు.

"ఎవరూ?" ఎవరిదో కేక.

రాఘవ అన్నంనిండిన వాడిని పొట్టకు మరింతగా అదుముకుంటూ పరుగుతీసాడు. వీధిలో నిద్రపోతున్న కుక్క వెంటపడ్డంతో రాఘవకు ఎక్కడలేని శక్తి వచ్చింది. సందులు గొందులు తిరిగి తిరిగి గది చేరుకున్నాడు.

"హమయ్యా! వచ్చేసాను" అనుకుంటూ గుండెనిండా ఊపిరి పీల్చుకున్నాడు రాఘవ.



# చేజారిన రత్నం

కాకాని కమల

పోస్టుమేన్ అందించిన కవరు అందుకుని ఆత్రంగా చించింది విమల.

"....మీ చెల్లెలు శశీల రెండు రోజులుగ కనిపించుటలేదు. మాకు చాలా ఆందోళనగా యున్నది. రవికి, మధుకి కూడా రాసినాను. అల్లుడి గార్ని కూడా ఈ విషయమై కొంచెము ప్రయత్నము చెయ్యమని చెప్పవలసినది. మీ నాన్న పరిస్థితి మరీ అధ్వాన్నంగా వున్నది. వీలుచూసుకుని ఒకసారి రాగలవు. ఇట్లు— సీతమ్మ...." అంటూ పుట్టింటినుంచి మేనత్త రాసిన వుత్తరం చదువుకున్న విమల గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి. కాళ్ళక్రింద భూమి కదిలినట్లయింది. ఎలాగో అతి ప్రయత్నంమీద నిలద్రొక్కుకుని, ప్రక్కనే వున్న కుర్చీలో కూలబడింది.

"ఏమిటి?!....తన చెల్లెలు కనిపించటంలేదా? కాలుజారి అసహాయురాలై ఏ ఆత్మహత్యకైనా పాల్పడలేదు కదా! భగవాన్....ఏమిటీ విపరీతం? ఈ సంగతి ఈయనకి తెలిస్తే ఇంకేమయినా వుందా? ఇప్పటికే వీలు దొరికినప్పుడల్లా తనను సాధిస్తూ వుంటారు. దానికితోడు ఇదొకటా. ఇటువంటి ప్రళయాలకి తన సంసారం కూలిపోకుండా నిలుస్తుందా?" విమల గుండెల్లో సన్నటి అలజడి బయలుదేరింది. భర్తమీది ద్వేషం దావానలంలా దహిస్తోంది.

అమాయకురాలైన అత్తయ్యకేం తెలుసు. అల్లుడిగారికి చెప్పి వెతికించే ప్రయత్నము చెయ్యమని రాసింది. ఇటువంటి పరిస్థితిని సహృదయంతో అర్థం చేసుకుని సహకరించే అల్లుడేనా ఈయన? అసలు తనకి ఈయన భర్తా? కాదు బ్రహ్మరాక్షసుడు....తనపాలిట యమకింకరుడు. అనుకుంది కసిగా తనలో విమల.

ఇంతలో ఆ యమకింకరుడు తలుపు బాదటంతో కంగారుగా లేచివెళ్ళి తలుపు తీసింది.

విమల భర్త రామారావుకి సంసారం భార్యా అనే గొడవలు ఏకోశానా పట్టవు. అతని సరదాలు వేరే వున్నాయి. తన భార్యను ప్రాణమున్న మనిషిగా గుర్తించలేకపోవటం అతని ప్రత్యేకత. 2 సం॥రాలు కూడా నిండని పచ్చిరాని

మాటలతో ముద్దులు మూటకట్టే కన్నకొడుకు సైతం అతని ప్రేమకి నోచుకో లేక పోయాడు.

అన్నివిధాల భర్తని ద్వేషించే విమల ఒక్క విషయంలోమాత్రం భర్తని మెచ్చుకోకుండా వుండలేదు. విమలకి పుట్టింటినుంచి వచ్చే వుత్తరాల సంగతి కాని ఆమె వాళ్ళకి రాసేవాటి సంగతికాని అతనికి పట్టవు. ఏం రాసుకున్నా నన్ను ఎవరూ ఏమీ చేయలేరన్న ధీమాకావచ్చు. అంతేకాదు విమల ఇష్టం వచ్చినప్పుడల్లా పుట్టింటికి వెళ్ళే స్వాతంత్రం కూడా ఆమెకిచ్చాడు. తనకు కొంత కాలమైనా కొంత అడ్డు తొలగగలదనే భావంతో. కాగా కలకాలం విమల కన్నవారింట్లోనే వుండిపోయినా ఇబ్బందిలేదు రామారావుకి.

విమల తన భర్తకి అసలు విషయం చెప్పలేదు. తండ్రికి ఒంట్లో బాగా లేదని మాత్రం చెప్పి బయలుదేరింది. 10 రూపాయల నోటు అందించాడు భార్యకి. అప్పటికి ఆమె పుట్టింటికి వెళ్ళి నాలుగు నెలలు మాత్రమే అయింది.

* * *

గుమ్మంలో అడుగు పెట్టేసరికి ఆమె తలంచినట్లు తనకు ఎవరూ ఎదురు రాలేదు. చీకటి చీకటిగ బిక్కుబిక్కుమంటూ వున్న ఇంటిని చూట్టంతోనే హృదయం అట్టడుగునుండి దుఃఖం వెల్లువలా పెల్లుబికింది విమలకి. తల్లి పోవటంతోనే ఆయింటి కళ తప్పింది. బాబుని దింపి మెల్లిగా ప్రక్కనేవున్న తండ్రి గదిలోకి అడుగు పెట్టింది. ఆ ముసలాయన రెండుచేతులు గుండెల మీద పెట్టుకుని ఇంటికప్పుకేసి చూస్తూ పడుకున్నాడు. శుష్కించిన శరీరం మంచానికి అంటిపెట్టుకుని వుంది. అలికిడికి గుమ్మంకేసి చూసి దిగ్గున లేచి కూర్చున్నాడు తండ్రి.

"తల్లీ! విమలా....వచ్చావా, చూశావా తల్లీ! సుశీల ఎంతపని చేసిందో ఈ ముసలి కాలంలో నా గుండెల్లో ఎంత చిచ్చు పెట్టిందో" అంటూ దిండు క్రింద పదిలపరిచిన కాగితం తీసి విమల చేతుల్లోపెట్టాడు. అది సుశీల రాసిన వుత్తరం. ఎన్నిసార్లు చదువుకున్నాడోగాని చాలా భాగం నలిగిపోయి వుంది. ఆతృతగా మడత విప్పింది విమల....

"....నాన్నా! నువ్వు నాకోసం వెతికించే ప్రయాస పడకు. నేను నరేంద్రగుప్త గారు కలసే వెళ్ళిపోతున్నాము. దీన్ని నీ పరిభాషలో లేచి పోవటమను. మరి ఇంకేమయినా అను. నా కనవసరం. ఎందుకంటావా,

మేమిద్దరం పెళ్ళి చేసుకోబోతున్నాం. ఆయన నన్ను మోసం చేస్తాడని నువ్వేమి బెంగపడకు. ఆయన అటువంటి వ్యక్తికాడు. చాలా మంచివాడు. సహృదయుడు ఆయన్ని బాగా అర్ధంచేసుకున్న పిమ్మటే నేను ఈ నిర్ణయానికి వచ్చాను. నేను పట్టింది గట్టి కొమ్మన్న నమ్మకం నాకు బాగావుంది. నీవు అనుకుంటున్నట్లు ప్రేమ వివాహాలన్నీ విఫలమూ కావు, సంప్రదాయకంగా జరిగినవన్నీ సఫలీకృతమూ కావు. నువ్వు నిజంగా నీ కూతురి సుఖమే కోరుకుంటే మమ్మ నిండు మనసుతో ఆశీర్వదించు.

నువ్వు పాత సంప్రదాయాలతో కూర్చొక మా మనసుల్ని అర్థం చేసుకునే సమర్థతే నీకుంటే మా యీ వివాహం నీ సాన్నిధ్యంలోనే జరిగి వుండేది. కాని నాన్నా! నువు మారవు, మారలేవు. అందుకే నేను ఈ మార్గాన్ని అనుసరించక తప్పటంలేదు. తల్లిలా పెంచిన సీతమ్మత్తకి కూడా నేను చెప్పలేదు. క్షమించమని చెప్పు.

అభానికి సుభానికి కూడా మనకి మన బంధువర్గంతో సంబంధం లేకుండా తెగతెంపులు ఏనాడో జరిగి పొయ్యాయి. దాదాపు కులభ్రష్టులమని మనలను వెలివేశారు. నువ్వు అంటూ వుంటావుకదా. "నీ పరువుప్రతిష్టలు అన్నయ్యల వల్ల మంట కలిశాయనీ, మన వంశం కుక్క ముట్టుకున్న విస్తరయిందనీనూ". కనుక ఈనాడు నా వల్ల ప్రత్యేకంగా నీ పరువుకి అదనపు నష్టం వస్తుందని నేను అనుకోవటంలేదు. విమలక్కయ్యకి నా నమస్కారములని చెప్పండి. నీకు కూడా నా తుది నమస్కారములు. ఇట్లు—సుశీల...."

....వుత్తరం చదువుతున్నంతసేపూ అవ్యక్తమయిన ఆనందం విమల కళ్ళల్లో మెదిలింది. అ సమయంలో తండ్రి గుండెలపై కొట్టుకుంటూ వ్యక్తం చేసే ఆవేదన ఆమె చెవులకి సోకటంలేదు. అమాయకంగా అందంగా వుండే 16 సం॥రాల సుశీల, 2 సం॥రాలకిత్రం వుద్యోగరీత్యా వచ్చిన నవయువకుడు నరేంద్రగుప్త ఆమె కళ్ళముందు మెదుల్తున్నారు.

చిన్నపిల్ల అయినా సుశీల తన భర్తస్థానంలో మంచివ్యక్తినే ఎన్నుకుంది. 16 ఏళ్ళ ప్రాయంలో సుశీకున్నపాటి ధైర్యం, సాహసం 18 సం॥రాల ప్రాయంలో తన కెందుకు లేకపొయ్యాయి? అని ప్రశ్నించుకుంది విమల. దానికి కారణం తండ్రే! అన్నభావం ఆమెలో మెరుపులా మెరిసింది. చురుగ్గా తండ్రికేసి చూసింది.

"ఈమాత్రందానికి యింతగా దిగులుపడిపోతావేం నాన్నా! ఆ కుర్రాడిని

ఒకటి రెండుసార్లు నేనూ చూశాను. చాలా మంచివాడు. కోమట్లకుర్రాడైతేనేం, ఒక ఆడపిల్లని వంచించేంత నీచుడుమాత్రం కాదు" అంది.

అప్రతిభుడే అయ్యాడు తండ్రి.

....పెద్దన్నయ్య రవివర్మ, మహమ్మదీయుల పిల్లని చేసుకుంటేనేం? వాళ్ళిద్దరూ డాక్టర్లు. డబ్బుకీ, విజ్ఞానానికీ లోటులేదు. ముద్దులొలికే పిల్లలు. వారిమధ్య ఎనలేని అనురాగబంధం....

చిన్నన్న మధు! వాడు నిజంగా మధుమూర్తే! వాడు క్రైస్తవుల పిల్లని చేసుకుంటేనేం? వాళ్ళ హృదయాల్లోని మధుకలశం కనీసం వూహాకికూడా అందదు. ఒకరు ఇనుపరజను అయితే మరొకరు అయస్కాంతం. వాళ్ళ పెళ్ళిళ్లు అయి ఐదేసి సంవత్సరాలు దాటుతున్నా ఇంకా కాలేజీల్లోని ప్రేమికుల్లానే వుంటారు.

పుట్టింటికి ఎప్పుడు వచ్చినా తండ్రితోటి చెల్లెలుతోటి కాస్త సుఖంగా గడిపాననుకుని తృప్తిపడేది విమల. కాని ఈసారి ఆ కాస్తసంతోషంకూడా లేకుండాపోయాయి ఆమె ప్రాణానికి.

కొడుకుని భుజానవేసుకుని జో....కొడుతూ కిటికీకి ఆనుకు నిల్చుంది విమల. ఎదురుగా రాంరెడ్డి మేడ కళతప్పి నిలిచివుంది. పెళ్ళిపీటలు ఎక్కేత్రోవలోనే "ప్రేమ" అనే మధుభాండాన్ని తన్నుకున్న అభాగ్యురాలు విమల. పాతజ్ఞాపకాలు కనులముందు మెదిలాయి.

....సుందర్‌రెడ్డిని తను ఆనాడు ధైర్యంచేసి పెళ్ళి చేసుకునివుంటే తనకీనాడు ఇంతటి హృదయావేదన వుండేదికాదు. బలీయంగా పెనవేసుకున్న తమ మనసుల్ని కులంపేరుతో సంఘం తన కరుకుహస్తాలతో విడదీసింది. ఈనాడు తన సంసారంలో సుఖశాంతులు లేకపోవటానికి సుందర్ వుసురే కారణమా? పేరుకితగ్గ రూపంలోవుండే సుందర్ మృదుహృదయుడు. నిజంగా అటువంటి యువకులు అరుదు. సుందర్ అపురూపమైనవాడు. తన్ని అమితంగా ఆరాధించిన అతని హృదయం తన వియోగంతో దెబ్బతింది. 30 సంవత్సరాలు వచ్చినా అతను అవివాహితుడుగానే మిగిలిపోయాడు. ఎవరెంత చెప్పినా అతడు పెళ్ళికి సుముఖంగాలేడని వింది. అతని కంతటి విరక్తి ఎందుకు కలగను. అతని ఆవేదనకి కారణం తను. కనుక తనే దానిని రూపుమాపే ప్రయత్నం చెయ్యాలి. అది తన కనీసబాధ్యత. అతని జీవితం మెరుగుపడితే కొంతవరకైనా తనకి వూరట. అవును....వెళ్ళాలి" అనుకున్నది విమల ధృఢంగా.

బాబుని పక్కమీద పడుకోబెట్టి సుందర్ యింటికి బయలుదేరింది. పెరటిదారిన వెళ్ళేసరికి సుందర్‌తల్లి కనిపించింది. ఆవిడ శారీరకంగాకూడా కృశించింది. "నా తల్లే.... అబ్బాయిని చూడటానికి వచ్చావా" అంటూ ఆప్యాయంగా విమలని స్పృశించింది, మెటికలు విరుచుకుంది. మళ్ళీ సుశీలగొడవ ఎత్తింది. అంతట్లోకే కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుని భర్తని గుర్తుచేసుకుంది. ఆవిడకి కొంచెం మతిస్థిమితం తప్పినట్లుకూడా గుర్తించింది విమల. విమలతో మాట్లాడుతున్నంతసేపూకూడా ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూనేవుంది....

....ఇంత ఆస్తివుండి ఏం ప్రయోజనం చెప్పుతల్లీ? వాడు పెళ్ళి చేసుకోనని మొండికేసుక్కూర్చుండె!....నా కున్నది వాడొక్క నలుసు. చూడమ్మా, మీ యిద్దరూ చిన్ననాటి స్నేహితులు. అబ్బాయికి నీ మాటంటే గురి. అస్తమానం నీ సంగతులే అడుగుతాడు. పోనీ నువ్వైనా కాస్తచెప్పి వాడి బుద్ధి మార్చుతల్లీ! చచ్చి నీ కడుపున పుడతాను.... అంటుంటే విమల గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. చిన్నప్పుడంతా విమల వాళ్ళింట్లో చాలా చనువుగా తిరిగేది.

సుందర్ గది చూడగానే ఆమె క్షణం స్తంభించినట్లయి ఉక్కిరి బిక్కిరి అయింది. సన్నగా గాలికి ఎగురుతున్న తెర తొలగించుకుని లోపలికి అడుగు పెట్టింది విమల?

సోఫాలో వెనక్కి ఆనుకుని సిగరెట్ కాలుస్తున్న సుందర్ 'కరుణించని దేవత ప్రత్యక్షమయినంత' ఆశ్చర్యపోయాడు. చటుక్కున సిగరెట్ ట్రేలో పారేసి "నువ్వా? ఎన్నాళ్ళకి!?" అంటూ సంతోషం నిండిన స్వరంతో లేచి ఎదురుగా వచ్చి ఆపేక్షగా ఆహ్వానించాడు. అతన్ని చూస్తూ కూర్చున్న విమల హృదయంలో అనిర్వచనీయమైన బాధ సుళ్ళు తిరిగింది. హృదయంలో ముళ్ళకంప కదిలినప్పటి బాధ? సుందర్‌లో చాలా మార్పే కనుపిస్తోంది.

"అదేమిటి విమ్మీ! అలా కొత్తగా చూస్తున్నావ్?" చూపు మరొక దిక్కుకు త్రిప్పుకొంది విమల. మళ్ళీ సుందరే అన్నాడు. "నువ్వు మీ యింట్లో తప్ప పుట్టావ్ నా దురదృష్టం కొద్దీ. మీ చెల్లెలుకున్నపాటి ధైర్యం నీకు లేకపోయింది కదూ".

బరువుగా నిట్టూర్చింది విమల.

"సుందర్! నామూలాన నీ జీవితం ఇలా కావడం నేను చూడలేను. దయచేసి నాకు అంత అసంతృప్తిని మిగల్చకు. నాకు ఈనాడు ఎటు చూసినా చీకటే కనుపిస్తోంది. నువ్వు గృహస్తువయితే నాకు కొంచెం వూరట. చెప్పు

సుందర్ పెళ్ళి చేసుకుంటావా లేదా? చెప్తున్నా విను....నువ్వు పెళ్ళి చేసుకోక పోతే నేను నిజంగా చచ్చిపోతాను. నేను నిజంగా అన్నంతపని చేస్తాను. ఇది బెదిరింపు ఎంతమాత్రంకాదు. నా అంతరాత్మఘోష. నేనుమాత్రం నిన్ను ఇలా చూడలేను. ఆ కన్నతల్లి వుసురుమాత్రం నాకు తగలనియ్యకు." అంటూ చేతుల్లో ముఖం పెట్టుకుని ఏడ్చింది విమల.

బిత్తరపోయాడు సుందర్. ఆమెలో కరుడుగట్టిన దుఃఖం చూస్తూవుంటే అతని గుండె గొంతుకలో కొట్లాడింది.

"ఛ....ఊరుకో విమలా. నువ్వు అలా బాధపడితే నేను చూడలేను. అయినా పెళ్ళి చేసుకొని ఏంలాభం చెప్పు? ఆ అమ్మాయిని సుఖపెట్టలేక పోయిన తరువాత? అది మాత్రం పాపంకాదూ?"

"వద్దు....వద్దు....నాకామాటలన్నీ చెప్పకు. నువ్వు చేసుకుంటావా చేసుకోవా చెప్పు సుందర్! మీరంతా ఇట్లా బాధపడుతూవుంటే నాకు శ్రేయస్కరమా చెప్పు. ఆ వుసురంతా నాదికాదూ? అందుకే నా బ్రతుకిలా అయింది" అంది ఆవేదనగా.

సుందర్ ఆమెవైపు విచిత్రంగా చూశాడు. ఆమె చూపు తప్పించేసి "సుందర్ మీ యింట్లో వాళ్ళ ఉసురు నాకు తగలనివ్వకు. నేను సుఖంగా వుండాలనుకుంటే నువ్వు పెళ్ళిచేసుకు తీరాలి. ఏమంటావు సుందర్. నువ్వు పెళ్ళికి ఒప్పుకోకపోతే నేను యిక్కడినుంచి కదిలి వెళ్ళను" అంది.

సుందర్ ఏమీ మాట్లాడలేదు. ఓ పావుగంటసేపు విమల మౌనంగా కూచుని—

"ఏమంటావు చెప్పు సుందర్" అని తిరిగి ప్రశ్నించింది.

"ఆ విషయమే నేనూ ఆలోచిస్తున్నాను" అన్నాడు.

అంతలోనే సుందర్‌రెడ్డి తల్లి మేడమీదకి రావడంతో ఆ ప్రస్తావన ఆగిపోయింది. మరో పది నిమిషాలు అక్కడ వుండి వచ్చేసింది విమల.

ఆ తరువాత రెండు రోజులకే భర్త దగ్గరకి వచ్చేసింది విమల. దగ్గర దగ్గర ఓ పదిరోజులు సాఫీగానే గడిచాయి. ఏ వ్యవహారంలో ఉన్నాడోగాని రామారావు తిన్నగ ఓ వారంరోజులు ఇంటిపట్టునే లేడు.

ఈయనకింకా తెలియదా? తెలిస్తే తనొక ప్రళయాన్నే ఎదుర్కోవాలి అనుకుంది విమల. అనుకున్నంతా జరిగింది ఒకరోజు.

ఏదో సాధించ తల్చుకుంటేనో, తిట్టదలచుకుంటేనో తప్ప సాధారణంగా

నోరు విప్పడు రామారావు.

"మీ చెల్లెలు ఎవడితోనో లేచిపోయిందిటగా!" అన్నాడు అదేదో విమల అపరాధ మయినట్లు. ఇటువంటి ప్రశ్నను ఎదుర్కోవాలని ముందే వూహించిన విమల ఎంతమాత్రం తత్తరపడలేదు. "అవును" అందిముక్తసరిగా. అతనికి అంతకంటె మంచిభాష రాదని తెలుసు విమలకి.

ఛా....సిగ్గులేదూ? నీ చెల్లెలు లేచిపోయింది. నీ అన్నలు కులభ్రష్టులు. ఇదివరకు నువ్వు ఎవడితోనో తిరిగే దానివటగా! నరహరి చెపితే తెలిసింది, అన్నాడు. నరహరి పేరు వినగానే కీచకుడు గుర్తుకు వచ్చాడు. విమలకి నిన్ను నేను కాబట్టి ఇంతకాలం భరించా. కాని ఇంకనేను సహించను. ఈ నాటితో నీకూ నాకూ సంబంధం తెగిపోయింది. ఇంక తక్షణం నా యింట్లోంచి వెళ్ళిపో. నేనిలాగే వూరుకుంటే రేపు నువ్వు ఇలాటి వెధవపనేదో చేసి నా పరువు తీసేస్తావు. ఇక్కడ నీకు స్థానంలేదు. వింటున్నావా అని గర్జించాడు.

విమల ఖంగారు పడలేదు. అనుకున్నదే జరిగింది. అసలు రామారావు విమలని ఎలా వదిలించుకుందామా అనుకుంటున్నాడు. ఇప్పుడు కారణం కూడా దొరికింది. ఇంక అడ్డేముంది? అసలేకోతి. కల్లు తాగింది. ఇంక తంద నాలకి తక్కువా?

అనుకున్నదే అయినా అతను అలా వెళ్ళిపొమ్మంటుంటే విమలకి దుఃఖం పొర్లు కొచ్చింది. ఇన్నాళ్ళు అతనితో సహజీవనం సాగించినందుకు ఈ బాధ తప్పదా. అసలీ బంధాలు ఎలా ఏర్పడతాయి? అనుకుంది. ఎదురుగా భర్త జవాబుకోసం నిలేసినట్లు చూస్తుంటే ఇంక ఆలోచించలేక పోయింది. "ఇక్కడ వుండి నేను సుఖపడేది ఏమీలేదు. అలాగే వెడతాను" అంటూ కొడుకుని చెయ్యిచాచి దగ్గరకుతీసుకుంది. తండ్రి కోపపు గద్దింపులకి భయపడి ఏడుపే తరువాయి అన్నట్లుగా నిల్చున్నాడు. నా జీవితం నా కొక సమస్యకాదు. కొడుకుని అన్నల కప్పగించినా దివ్యంగా పెంచుతారు. ఇంక నేనేమయినా ఫర్వాలేదు. అనుకుంది నిర్వికారంగా తనలో. ఏదో ఒక తెంపు చేసుకోవాలి గాని సుఖంలేని బ్రతుకు ఎన్నాళ్ళు? అనిపించిందామె మనసుకి.

భార్య జవాబువిని రామారావు ఆశ్చర్యపోయాడు. అంతులేని విజయాన్ని పొందినంత ఆనందంగా వుంది అతనికి. ఇంత తొందరగా ఈ జటిల సమస్య

పరిష్కార మవుతుందనుకోలేదు. అసలే రెండు సంసారాలతో ఛస్తున్నాడేమో విమల నిర్ణయం అతనిని ఆకాశంలో విహరింపచేసింది.

ఓ అర్ధగంట తర్వాత అతను సామాను సర్దుకుంటుంటే విమల దగ్గర కొచ్చి "వెళ్ళేముందు ఇక్కడ సంతకం పెట్టి వెళ్లు. అంటూ కాగితాలు అందించాడు. ఒకటి విడాకుల పత్రం. అది అంతా విమల ఇష్టంమీదే జరుగుతున్నట్లు. రెండవది అతని ఆర్జనలో ఏవిధమయిన హక్కు వద్దని విమలే రాసిచ్చినట్లు వుంది. అతని సంకుచితత్వానికి, హద్దుమీరిన స్వార్థపరత్వానికి నవ్వొకుంది విమల. నిండామునిగాక చలేమిటి? కాని అతని కుతంత్రబుద్ధికి, దురాలోచనకు అసహ్యంవేసింది విమలకు.

ఆ కాగితాలపై సంతకాలను గురించి మీరేమీ బెంగపెట్టుకోనక్కరలేదు. నావల్లమీకు ఎట్టిప్రమాదం రాదని హామీ యిస్తున్నాను. అంది విమల వికల హృదయంతో.

అది కాదు విమలా! అవునులే! నువుచెప్పిందీ నిజమే! నీమీద నాకామాత్రం నమ్మకం వుంది. ప్రస్తుతం ఈ కాగితాల అవుసరం ఏమిలేదులే. అయినా ఎందుకైనా మంచిదని ముందు జాగ్రత్త కొఱకే ఇవి వ్రాశాను. అందుచేత ప్లీజ్....ఈ రెంటిమీద సంతకం పెట్టిమరీ వెళ్లు విమలా! అయినా నీకు అభ్యంతరం లేదని ఎలాగూ అంటున్నావు. ఇక సంతకాలు చెయ్యటానికేమిటి ఆలోచన? అన్నాడు రామారావు.

రామారావుముష్కరత్వానికి విమలకు వళ్ళుమండింది. తోక తొక్కిన త్రాచులా లేచి అపరశక్తి స్వరూపిణిలా విజృంభించింది. ....ఏమిటి? సంతకాలు చెయ్యాలా? మాటంటే నమ్మకంలేదూ? అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యచేత కావాలని కోరి విడాకులు రాయించుకొనే నీచుడవని నేనింతవరకు అనుకోలేదు. పైగా కట్టుకున్న భార్య ఇల్లువిడిచి వెళ్ళిపోతేనే చాలనే నీ వంటి మనస్తత్వం గల పురుషులు, సంఘానికి చీడపురుగులేకాదు, మానవజాతికే పీరు తలవంపు. ఇట్టి నీచుడవు, పరస్త్రీలోలుడవు అసలు ఎందుకు వివాహం చేసుకున్నట్లు? నీ దుశ్చర్యలకు మరొకజీవిని కూడా బలిచెయ్యటం ఎందుకు? కన్నకొడుకుపైన మమకారం కూడాలేని కఠినాత్ముడవు నువ్వు! తల్చుకుంటేనే నాకు అసహ్యమేస్తోంది. నేనూ నా బిడ్డా బ్రతకలేక పోము. ఇంత వరకు ఒక నీచుడితో జరిగిన సహచరత్వానికి, సంబంధానికీ నా మనస్సు

ఏడుస్తోంది. దానికి తోడు కోర్టుకు వెళ్ళి నీ నీచపు సంపాదనలో భాగం కూడా సంపాదించి బ్రతకాలని చూస్తున్నా ననుకున్నావా? ఆ నీచపు సొమ్ము నా కక్కరలేదు. సరికదా....నా కొడుక్కికూడా అక్కరలేదు." అంటూ విసురుగ్గా పడగ్గదిలోకివచ్చి చేతికందినబట్ట సర్దుకుని బయటికి నడిచింది విమల. బెదురుగా తండ్రిని చూస్తూ తల్లిని అనుసరించాడు కొడుకు.

అనుకోని పరిణామానికి ఆశ్చర్యపోతూ అలాగే నిల్చుండిపోయాడు రామారావు.

* * *

అంత తొందరగా మళ్ళీవచ్చిన విమలని చూసి ఆశ్చర్యపోయింది సీతమ్మ. అసలు సంగతి మెల్లిగా చెప్పవచ్చులే అని ప్రస్తుతానికి ఏదో సర్ది చెప్పింది విమల.

ఆరోజు సాయంత్రం కొడుకుని బుజాన వేసుకొని అలవాటుగ కిటికీ తెరిచిన విమల తృళ్ళిపడింది. ఎప్పుడూ కళావిహీనంగావుండే సుందర్‌రెడ్డి మేడ తెల్లటి సున్నంతో శోభాయమానంగా వుంది. ఇంటి ముందు నిలువెత్తు గుంజలు పాతి పాలేళ్ళు పందిరి అల్లుతున్నారు. అప్పుడే అటుగావచ్చిన సీతమ్మ అదిచూసి "రేపు సుందర్‌రెడ్డి పెళ్ళే అమ్మాయి! ఇన్నాళ్ళకి కల్యాణఘడియ వచ్చింది" అంది.



# కాలసూచిక

## సి. ఎం. రామకృష్ణారెడ్డి

బజారుకు వెళ్తున్న వాడినల్లా వర్మ పిలవడంతో ఆగాను. వర్మ రావడంతోటే నా రెక్కపుచ్చుకొని 'వెనక్కునడు, నీకో విషయం చెప్పాలి' అన్నాడు. నేను ఆదుర్దాగా 'ఏం! ముల్కీకి ప్రతికూలంగా మళ్ళీ బస్సులు తగులబెట్టా రేమిటి' అన్నాను. 'అబ్బే, అలాంటిది ఏంలేదు. ముందు నా వెంటనడు' అన్నాడు. నేను వాడిని అనుసరించాను. వాడు సందుగొందులు త్రిప్పి, చౌరాస్తా దాటాక ఒక లేబరేటరీలోకి తీసుకవెళ్ళాడు. వాడు అలా నా రెక్కపుచ్చుక లాక్కెళుతూంటే నాకంతా అయోమయంగా తోచింది. అయినా నావద్ద వాడికివున్న చనువుకొద్దీ వాడిని ఆ సమయంలో ఏమీ అనలేకపోయాను. నన్నొక ప్రైవేట్ రూములోనికి లాక్కెళ్ళాడు. అక్కడ కూర్చున్న వ్యక్తితో 'చిన్నాన్నా! పిల్చుకవచ్చాను. వీడు నా ఫ్రెండ్ రావు. స్ట్రైక్ సందర్భంగా క్లాసులనేవి లేకుండాచేసి కాలేజీయే మాకు ఎగనామం పెట్టింది. ఇప్పుడు ఇద్దరం రోడ్లు సర్వే చేస్తున్నాం. అక్కడక్కడ రోడ్లు మరీ గుంతలుపడి కొందరు సోకాల్డ్ పెద్దమనుషుల్ని రాత్రిపేళ స్పృహలేక నడిచి వస్తున్నప్పుడు లోనికి ఆహ్వానిస్తున్నాయి' అన్నాడు. డాక్టర్ రాజవర్మ (వీడికి స్వయాన వేలువిడిచిన చిన్నాన్న) వీడిమాటలకు చిఱునవ్వు నవ్వుతూ కూర్చొనున్నాడు. కొద్దిసేపు పిచ్చాపాటీ మాట్లాడ్డం అయ్యాక మమ్మల్ని తమవెంట రమ్మన్నాడు. మేం ఆయన్ని అనుసరించాము. చీకటి మెట్లు, వాటిని దాటివెళ్ళాక మరోగది. మళ్ళీ మెట్లు. ఇలా భూగృహం చేరేసరికి అర్థగంటపైగా పట్టింది. భూగృహం తాళాలు తెరుస్తూ 'ఇది నా పరిశోధనాలయం' అంటూ రాజవర్మ ముందుకు నడిచాడు. ఆయన మీట నొక్కాడు. మీట నొక్కడంతో గది అంతా ఒక్కసారి ప్రకాశమానంగా వెలుగొందింది. రాజవర్మ మమ్మల్నిద్దర్నీ ఒక యంత్రంవద్దకు తీసుకు వెళ్ళి చూపిస్తూ 'ఇది టైం మెషిన్, కాలసూచిక' అన్నమాట. పదిసంవత్సరాల పాటు అహోరాత్రాలు కృషిచేసి ఇది కనుగొన్నాను. ఇన్నాళ్ళకు నా శ్రమ ఫలించింది. మీకు ఈనాటికి దీనిసంగతేమిటో అర్థమయ్యుంటుంది. ఈ యంత్రం హిందూదేశానికి మాత్రమే పరిమితమైన చరిత్ర చూపిస్తుంది. ఇది విజయవంత

మైతే ప్రపంచ ప్రాతిపదికగా దీన్ని రూపొందిస్తాను. ఈ యంత్రం మనల్ని శతాబ్దాల వెనక్కి తీసుకువెళ్తుంది. అప్పుడు జీవించినవారితో మనల్ని మాట్లాడింప చేస్తుంది. అలాగే చరిత్రలో మరికొన్ని శతాబ్దాల ముందుకు కూడా మనల్ని తీసుకవెళ్తుంది. మన ముందుతరంవాళ్ళతో మాట్లాడవచ్చు. మీకు నా కృషిఫలితం చూపించాలనే పిలిపించాను' అంటూ మాకేసి తిరిగాడు. 'అలాగే చిన్నాన్నా! చూపించు అన్నాడు వర్మ. నేను ఆతృతతో కాలసూచిక కేసి చూడసాగాను.

రాజవర్మ ఒకదానివెంట ఒకటిగా నాలుగయిదు మీటలు నొక్కాడు. మెషీన్ కెదురుగ్గా అమర్చబడ్డ స్క్రీన్‌పై, సినిమాలోలాగా బొమ్మలు పడటం మొదలెట్టాయి. నాకంతా అయోమయంగా వుంది. మానవులు కీకారణ్యముల లోను, మైదాన ప్రాంతములలోను గుంపులు గుంపులుగా పరుగెడుతున్నారు. అంతా దిసమొలల్లో వున్నారు. హిప్పీలలాగా జుట్టు పెరిగింది. ఒకరికేసి ఒకరు చూసి సంజ్ఞలు చేసుకొంటున్నారు. వాళ్ళ చేతుల్లో రాతి పనిముట్లు వున్నాయి. చరిత్ర పుటలు తిరిగాయి. సింధు మైదానంలో ద్రావిడులు సాగుచేస్తున్నారు. పాడి సమృద్ధిగా వుంది. ఆర్యులు గుంపులుగుంపులుగా ఆయుధ బలంతో ద్రావిడులపై దాడి చేస్తున్నారు. నాలో కోపం చిర్రెత్తుకొచ్చింది. 'ఆపండి ఈ అఘాయిత్యం' తెలియకుండానే కేకవేశాను. రాజవర్మ నా చేయి పట్టుకొంటూ—'వాట్ మిష్టర్ రావ్. డు యు వాంట్ టు స్పీక్ దెమ్' అన్నాడు. 'యస్' అన్నాను ప్రత్యుత్తరంగా—రాజవర్మ మరో మీట నొక్కాడు. సింధు లోయలో హరివిల్లులా వెల్లివిరిసిన నాగరికత. ద్రావిడులు మహోత్కృష్ట దశలో వున్నారు. బారులు తీర్చిన వీధులు. సరుకులు ఎత్తుకుంటున్న బళ్ళు, సరుకులు నింపుకొంటున్న పడలు, రాజమార్గంలో ఠీవిగా వెళ్తున్న మత్తేభాలు. విశాలాకాశం క్రింద తెల్లని పావురాల్లా రెక్కలు విప్పుకొని పైకెగసినట్లున్న సౌధరాజాలు, తీర్చి దిద్దినట్లున్న రాచబాటలు, అందంగా, పొంకంగా, ఆరోగ్యంగా నడచివెళ్తున్న స్త్రీ, పురుషులు. ఎక్కడా కన్పించని రాజరికం. నగరాల చుట్టూ గోడలులేవు. అగడ్తలులేవు. దూరంగా ఎవ్వరో ఖరీదైన దుస్తుల్లో నడచి వస్తున్నారు. అతని వెనుక మరికొందరు నడచి వస్తున్నారు. నేను ఆగాను (రాజవర్మ మరోమీట నొక్కాడు. నేను తెలులో మాట్లాడుతున్నాను. అతడు ద్రావిడ భాషలో మాట్లాడుతున్నాడు. ఆ యంత్రం దుబాసీలా పనిచేస్తుంది. ఇద్దరి మాటల్ని అనువదిస్తుంది. ఒకరిభావం మరొకరికి తెలియచెప్తుంది). అతడితో అన్నాను 'మీకు రాజరికం లేదేమిటి.'

'రాజరికం అంటే ఏమిటి?' అతను ఎదురుప్రశ్న వేశాడు.

నాకు కోపం ఛిర్రెత్తుకొచ్చింది. 'అదిగో' అన్నాను. అతడు వెనక్కు తిరిగి చూశాడు. 'ఆర్యులు గుంపులు గుంపులుగా పట్టణంవేపు దూసుకు వస్తున్నారు. కిరీటాలు ధరించారు. చేతుల్లో విల్లంబులు, రథాలు పూన్చి వాటితో కయ్యానికి వస్తున్నారు. సంధులోయలో రాజరిక ప్రతిష్ఠ చేసేందుకు మిడుతలదండుల్లా వస్తున్నారు. ద్రావిడ నాయకుడు ఇదంతా చూసి చావుకేక పెట్టాడు. తనచుట్టూ వున్న మనుష్యులకేసి తిరిగి 'దురాక్రమణ. మనం శత్రువును ఎదుర్కొనే స్థితిలోలేం. తప్పుకోండి' అంటూ పరుగెత్తాడు. ద్రావిడులు చెట్టుకొకరు పుట్ట కొకరుగా పరుగెత్తుతున్నారు. అంతటి నాగరికతా ఆర్యులచేతుల్లో బుగ్గిపాలైంది. ఇంతవరకూ ద్రావిడ నాయకుడు నా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. అది ఆర్యులు చెప్పారు ద్రావిడులు దస్యులయ్యారు, ఆర్యులు దేవతలయ్యారు.

చరిత్రపుటలు ఒక్కొక్కటే తిరగటం మొదలుపెట్టాయి.

ఆర్యులు రాజరికం స్థాపించారు. వర్ణవ్యవస్థ మొదలైంది. వర్గవ్యవస్థ ఆకులు తొడుక్కుంది. సూర్యవంశరాజులు, చంద్రవంశరాజులు, వాళ్ళ ప్రతిజ్ఞలు, రాజ్యత్యాగాలు, చనిపోయిన భర్తలను బ్రతికించుకోవడం, సూర్యగమనాన్ని ఆపడం, వాళ్ళగొడవ వాళ్ళకే పట్టింది. సామాన్యుల గొడవ ఎవరికీ పట్టలేదు. నెలకు మూడువానలు కురుస్తున్నాయి. ఋతువులు తమ ధర్మం తప్పడంలేదు. కానీ బానిసవ్యాపారం కూరగాయల వ్యాపారంలా కొనసాగుతోంది. నేను ఆగాను. చరిత్ర ముందుకెళ్ళింది. కపిలవస్తునగరం, అర్ధరాత్రి సమయం, సిద్ధార్థుడు తన భార్యను, ముద్దుల మూటగట్టే కొడుకును వదిలి, ఆ నిశీథిలో, బోధివృక్షంవైపుకు వెళ్తున్నాడు. సిద్ధార్థుడు బుద్ధుడయ్యాడు. గౌతమ బుద్ధుడయ్యాడు. ప్రశాంత మనోజ్ఞమైన స్వరూపం. ప్రజలంతా అతడికి బ్రహ్మరథం పట్టారు. రాజులు బౌద్ధమతం స్వీకరించారు. రాణులు శిష్యవర్గంలో చేరసాగారు. బుద్ధుడు మెళకువ పడ్డాడు. తన మతంలో వర్ణ, వర్గ విచక్షణాభేదం లేకుండా అందర్నీ చేర్చుకోసాగాడు. అందులో-మేడలపై విశ్రమించే ధనవంతులున్నారు. దండనాధులున్నారు. రోడ్డుప్రక్క శ్రమించే కష్టజీవులున్నారు. నిరుపేదలున్నారు. బుద్ధుడు ఒకనాటి ప్రాతఃకాలాన సునీతను తన శిష్యవర్గంలో చేర్చుకొన్నాడు. సునీత కురూపి. అనాథ. వీధులు ఊడ్చేవాడు. అంత గొప్పవాడి సాంగత్యం, శిష్యత్వం వాడికి లభించాయి. నేను బుద్ధుడికేసి చూశాను. 'స్వామీ! మీరు వర్ణవ్యవస్థను, వర్గవ్యవస్థను సమాజంలోనుంచి సమూలంగా పెకలించేందుకు ప్రయత్నం చేశారుకదూ?' అన్నాను.

గౌతమబుద్ధుడు సమాధానంగా చిఱునవ్వు నవ్వాడు.

నేను మళ్ళీ మొదలెట్టాను. 'మరి మీరు వెళ్ళి అయిదువేల సంవత్సరాలైనా మీరు పెకలించాలని ప్రయత్నించిన ఆ వ్యవస్థలు రెండూ ఇప్పటికీ కొనసాగుతున్నాయి' అన్నాను. బోధిసత్వుడు చిఱునవ్వు నవ్వి మెల్లగా 'నాయనా! సమాజం మారిపోయింది. మానవుడు విలాసాలకు లోనయ్యాడు. మానవత్వం గరికపోచ విలువ కల్గివుంది. మానవుని స్వభావం మార్చడం బ్రహ్మతరం కాదు' అన్నాడు. నేను మరోప్రశ్న వేశాను. బౌద్ధమతం హిందూదేశంలో స్థాపించబడింది. విదేశాలకు వెళ్ళిపోయింది. అచ్చటవారు ఆ మతంపట్ల చూపుతున్న ఆదరణ మనదేశంలో ఇప్పుడు లేదేం?' అందుకు సమాధానంగా బుద్ధుడు చిఱునవ్వు నవ్వాడు. మరేం సమాధానం ఇవ్వలేదు. పైచదువులకని విదేశాలకు వెళ్ళి అక్కడే స్థిరపడిపోతున్న మన శాస్త్రజ్ఞులు నాకు గుర్తువచ్చారు. తెర మరుగైంది. ఛిన్నాభిన్నమైన ఆర్యావర్తం. అంతఃకలహాలు. గ్రీకు దండయాత్ర. కుషానుల దండయాత్ర. మరో దండయాత్ర. మంటల్లోపడ్డ శలభాల్లా కొట్టుమిట్టాడుతున్న హైందవ సామ్రాజ్యాలు....జయచంద్రుడు నిండుపేరోలగంలో మహమ్మద్ ఘోరీని సన్మానిస్తున్నాడు. నాలో కోపం చిర్రెత్తుకొచ్చింది. 'వెధవా! జయచంద్రా! పృథ్వీరాజుతోపోరాటంసల్పలేకి పరాయివాడిని ఆహ్వానిస్తున్నావా! చివరకు వాళ్ళే నీ తల్లి కడుపున చిచ్చుపెడ్తారురా' అన్నాను. ఆవేశంతో-జయచంద్రుడు నవ్వాడు. 'చరిత్ర ఎప్పుడూ పునరావృత్తం అవుతుంది. ఆ విషయం అంభి నడుగు. కావాలంటే నా తర్వాతవచ్చే మీవాళ్ళనడుగు' (కొంపతీసి పదవులకోసం పార్టీలు మార్చే పెద్దలనుకూడా చెప్పబోదుస్తున్నా దేమిటి). జయచంద్రుడి సమాధానంకు నేను తల దించుకొన్నాను. భరతమాత దుస్థితికి నా కళ్ళల్లో నీళ్ళునిలిచాయి. మళ్ళీ తలఎత్తేసరికి నెమలిసింహాసనంపై కూర్చున్న షాజహాను కన్పించాడు. మాటలకోసం తడుముకొని అన్నాను. 'పాదుషాగారూ! మీరు తాజమహల్ కట్టించారు. కోట్లు ఖర్చుపెట్టారు. కానీ నేటి మా కవులు తాజమహలుకు రాళ్ళెత్తిన కూలీలెవరు అని ప్రశ్నిస్తున్నారు. నీవు ప్రజాస్వామ్యం ఎందుకు అమలుపరచలేక పోయావు. మామంత్రులంటునట్లు సమసమాజ సామ్యవాదం వేపు దృష్టిని ఎందుకు నిగిడించలేదు.' షాజహాను తన చేతికున్న వజ్రపుటుంగరంకేసి చూస్తూ అన్నాడు. అందరూ పల్లకీలు మోస్తే అందలం ఎక్కేవాళ్ళు కావాలిగా.' నేను రచయిత్రుల పారిభాషాపదంలా అవాక్కయ్యాను. మళ్ళీ అన్నాను. 'చరిత్రకారులు తాజ్ మహల్‌ను నీవు నిర్మించ

లేదంటున్నారు. రాజపుత్రుల అంతఃపురంకొని అలామార్చావుకదూ. కావాలంటే నావద్ద బోలెడన్ని ఆధారాలున్నాయ్' (సాక్ష్యాలేవీ అంటే....!) షాజహాను సమాధానం చెప్పలేదు. మౌనంగా వుండిపోయాడు. చరిత్ర తిరిగింది. దక్షిణాపథం. తుంగభద్రాతీరం. తుంగభద్రానదీలోయ మాలికల అంచుల్లో ఎనిమిది మైళ్ళు విస్తరించిన విజయనగర సామ్రాజ్య రాజధానీనగరం. నికోలోకంటి అంటున్నాడు 'ఇలాంటి నగరాన్ని ఇంతవరకు కళ్ళతో చూడలేదు చెవులతో వినలేదు.' శ్రీకృష్ణదేవరాయలు, అష్టదిగ్గజాలు, భువనవిజయం, అబ్బ వేయి కళ్ళుచాలవు. ఆ వీధులు, ఆసౌధాలు. 'అంగళ్ళ రతనాలు అమ్మివారట ఇచట. కత్తులు, ఘంటములు కదను ద్రొక్కిన వటఇచట' భావోద్రేకం విజయనగర సామ్రాజ్య పతనం. మహమ్మదీయుల ప్రాబల్యం. సామ్రాజ్యాలు తిరిగాయి. మహమ్మదీయ వైభవం సూర్యునిముందుదివిటీ అయ్యింది. ఆ సూర్యుడు మరెవ్వరో కాదు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం....జనరల్ డయ్యర్ నిర్దాక్షిణ్యంగా జలియన్‌వాలాబాగ్‌లో సమావేశమైన వారందరినీ కాల్చేయమని సైన్యానికి ఆజ్ఞాపిస్తున్నాడు. అబ్బ. కాల్పులు. వీధుల్లో శవాలు, మంటల్లో పిల్లలు. స్త్రీల ఆక్రందనలు, పోలీసుజులుం, తెల్లవాడి డివైడ్ అండ్ రూల్ పాలసీ....అహింసావాదం, సింహనాదం, సుభాష్ పలాయనం. అంతా వెళ్ళిపోతున్నారు. స్వాతంత్ర్యం, ముక్కలైన దేశం....నేను కళ్ళు మూసుకొన్నాను. మళ్ళీ తెరిచాను.

క్రీ. శ. 4000వ సంవత్సరం. వాహనాలు వెళ్తున్నాయి. జనం అక్కడక్కడ పల్చగావున్నారు. ఏదో సభ జరుగుతోంది. ఆగాను. ఎవరో ఉపన్యసిస్తున్నారు. నేను ప్రశ్నించాను. అతడు సమాధానం చెప్పాడు. 'ఇక్కడ కూర్చున్న వాళ్ళు మేధావులు. అక్కడ కూర్చున్నవాళ్ళు సామాన్యులు. మేధావులు ఎక్కువయ్యారు. జీవితమంతా ఆలోచనలతో గడిపేస్తున్నారు. 21వ శతాబ్దాంతంతో జరిగిన ప్రపంచ యుద్ధాలవల్ల ఇచ్చట జనసంఖ్య బాగా దెబ్బ తీసింది. కుటుంబ నియంత్రణ కొన్ని తరాలకు ముందువాళ్ళు పాటించడంవల్ల జనసంఖ్య ఇప్పుడు బాగా పల్చనైపోయింది. ఇప్పుడు ఆ ముందు కూర్చున్న వాళ్ళు మమ్మల్ని దిగి రమ్మంటున్నారు. జనాభా పెంచమంటున్నారు. ఇప్పటి శాస్త్రజ్ఞుల లెక్కప్రకారం జనభా తరుగుదల ఒక తరందాకా ఇలాగే కొనసాగితే ఆ తర్వాత ఏగోళంలోను మానవజీవి మచ్చుకైనా కన్పించదంటున్నారు. మానవజాతి అంతరిస్తుందంటున్నారు.' ప్రస్తుతం జ్ఞప్తికి వచ్చి అతడి మాటలు

నన్ను ఇరకాటంలో పెట్టాయి. మళ్ళీ అన్నాను. 'మీలో వర్ణవ్యవస్థ, వర్గ విభేదాలులేవా.' నా మాటలకు అతనిలో కోపం పాదరసంలా ప్రాకింది. 'ఒక సంపత్సరం పండించిన ధాన్యం ఇప్పటి జనాభాకు పదేళ్ళదాకా వస్తుంది. కావలసిన సౌకర్యాలున్నాయి. నీవు చెప్పే ధనవంతుడు, పేదవాడు అన్నదానికి అర్థం తెలియడంలేదు. ఇక వర్ణాలు రెండేరెండు ఆడవాళ్లు, మగవాళ్లు.'

నేను అవాక్కయ్యాను. మళ్ళీ 'మరి ఇప్పుడు నువ్వేం ఉపన్యసిస్తున్నావో' అన్నాడు.

'జనాభా పెంచేందుకు ప్రజలు దోహదం చెయ్యాలంటున్నాను. ఎక్కువ పిల్లల్ని కన్న స్త్రీలకు వీరమాత బిరుదు ప్రసాదిస్తామంటున్నాను. అదిగో పచ్చని త్రికోణం. అది జనాభా పెరుగుదలను సూచిస్తుంది. More luggage, most Comfort, make travel a pleasure' అన్న అతని మాటలకు నాకు త ల తి రి గి న ట్ల యి ం ది. వెనుకట ఎవ్వడో మధూరుకెళ్ళాలని గూడూరు వెళ్ళాడట.

కళ్లు బైర్లు కమ్మాయి. రోడ్డంట పరుగెత్తాను. సందు గొందులు తిరిగాను ఒక గుమ్మంముంగిట ఆగాను. ఎవరోలోపల స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడుతున్నారు. వేషధారణ నూరు పైసల తెలుగువాళ్ళలావుంది. నేను లోనికి వెళ్ళాను. గౌరవించారు. వాళ్ళ మాటల్లో స్వచ్ఛతవుంది. పలుకుల్లో నవ్యత వుంది. ఆంగ్లపదం మచ్చుకైనా లేదు. ఒక పీఠంపై త్యాగయ్య, వేమన, బ్రహ్మంగారు మొదలైన మహనీయుల చిత్రాలున్నాయి (మనం పై వాళ్ళను మరచినా ముందుతరంవాళ్ళను మరువలేదు). అబ్బాయి నిల్చున్నాడు. వాళ్ళమ్మతో అంటున్నాడు 'అమ్మా! నాకు మూన్‌ల్యాండ్ (చంద్రగోళం)లోని అయోలిన్ యూనివర్సిటీలో మెడిసిన్‌సీటు వచ్చిందే' అని 'అయోలిన్ ఎవ్వరబ్బాయ్' అన్నాను, ఆత్రంగా అబ్బాయి నాకేసి చిత్రంగా చూసి అన్నాడు. (అయోలిన్ పేరు తెలియదు! ఎవ్వరైనా వింటే నవ్వేస్తారు. భూగోళ ఖబంధహస్తాల నుంచి మూన్‌ల్యాండ్‌కు దాస్యవిముక్తి కావించిన మహనీయుడు. మూన్‌ల్యాండ్‌లో భూగోళ వాసుల వలస విధానానికి స్వస్తివాచకం చెప్పాడు. వాషింగ్టన్ లాంటి వాడు.' నాకు ఆశ్చర్యం వేసింది. హారినీదుంపతెగా!

ఆమెనింపాదిగా అంది 'హైదాబాద్‌కు సీటుకోసం ధరఖాస్తు చేశావే. ఏమైందబ్బాయ్?' అబ్బాయి అన్నాడు 'నేను హైదాబాద్ వెళ్ళేందుకు 'వీసా'

కోసం ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకొన్నానమ్మా. ఇంకా వీసారాలేదు. అందువల్ల మూన్‌ల్యాండ్‌కు వెళ్తున్నాను. అక్కడనుంచి సులభంగా మార్స్‌కో, జూపిటర్‌కో పైచదువులకు వెళ్ళవచ్చు.' నాకు తలతిరిగింది. 'ఏమిటబ్బాయ్. ఇదంతా! అర్థమెటిక్ ప్రాబ్లమ్‌లా నువు చెప్పేదేమీ అర్థం కావడంలేదు.' అన్నాను. అబ్బాయి నిర్లిప్తంగానవ్వి అన్నాడు. 'ఇది అంతే. ఇప్పుడు ఈ దేశంలోని రాష్ట్రాలన్నీ స్వతంత్ర ప్రతిపత్తి కల్గివున్నాయి. అలాగే జిల్లాలు కూడా. చదువుకోసం ఈ దేశంలోని ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతంలోకి వెళ్ళేలోగా (వీసా సంపాదించి) మరోగోళం వెళ్ళవచ్చు. అక్కడ భూగోళ వాసులకు మంచి గౌరవం. హైస్కేల్స్. బ్రైట్ ఫ్యూచర్' అబ్బాయి ముగించాడు.

అచ్చట నుండి రోడ్డుమీదకువచ్చాను.

సభముగిసింది. మేధావి వర్గంపై తిరుగుబాటు. జనంలో త్రొక్కిసలాట. మీద పడ్తున్నారు. ఎవరో జనంలోనుంచి అంటున్నారు. 'మీరంతా వచ్చేయండి. మాలో కలవండి. ఇక మీ మేధస్సు అక్కర్లేదు. మాకు కావలసింది జాతి మనుగడ!' విప్లవశంఖం పూరించారు. సింహనాదం కావించారు. మేధావులు జనాన్ని అదుపులో పెట్టలేక పోయారు. పోలీసు బలగంవచ్చింది. యస్. పి. అంటున్నాడు 'ప్రాణహాని జరపవద్దు. జనాన్ని నెమ్మదిగా కంట్రోల్ చెయ్యండి'. (వీళ్ళు. చాలామంచివాళ్లు. కనీసం టియర్‌గాస్ కూడా విడవడంలేదు.) నాలో ఉత్సాహం పెల్లుబికింది. కేకలువేస్తున్నాను. ఇంతలో వర్మ నా భుజం పట్టుకనన్ను గట్టిగా కుదిపేస్తూ 'ఏమిటిరా! పగటికలలు కంటున్నావా' అంటున్నాడు. నేను కళ్ళునులుముకొంటూ 'కాలసూచిక ఏదీ' అన్నాను. వాడు ఫక్కున నవ్వుతూ అన్నాడు. 'మధ్యాహ్నం మంచినిద్రలో వున్నట్లున్నావ్. అవతల పెరేడ్‌గ్రౌండ్స్‌లో స్టూడెంట్స్ యూనియన్ మీటింగ్‌వుంది. రేపు పట్టణంలో బంద్ జయప్రదంగా నిర్వహించాలి.' కలచెరిగింది. కలలో కాలసూచిక ఆగిపోయింది కాబోలు—నేను గతంనుంచి వర్తమానంలోకి వచ్చి పడ్డాను.



# అనాథ

పి. శంభుప్రసాద్

శిశిర నిశీధిలో చిందులు త్రొక్కుతున్న చలిలో గడ్డకట్టుకుపోయి ఉంది సజీవ పదార్థమొకటి రోడ్డుపక్కన. నిర్జీవమని ఎవరైనా అనుకుంటారేమోనని సజీవ మని నిరూపించే దాని మూలుగు - హృదయకుహరాలలోనుంచి అంతరాంతరాల లోని గుండెలు పిండుతూ మండుతున్న అగ్నిజ్వాలలను కడుపులో దాచుకొని వస్తున్న మూలుగు, ఎండిపోయి పండిపోయిన జీవితంలో మండి మాడ్చిన ఎండలనుంచి రక్షణకోసం నీడపంచన చేరి నీడనే నిండుభోజనంగా స్వీకరిస్తున్న మూలుగు-ఆ మూలుగు విన్పించలేదా?

విన్పించింది. గుండెలను చీల్చింది. పిండిచేసింది. అందుకే మూర్తి ఆ జీవపదార్థంవైపు దృష్టిసారించాడు. కాని ఆ పదార్థానికి కళ్ళులేవు. ఉన్నా సుస్థితిలోలేవు. అందుకే మూర్తి మరింత దగ్గరికి వెళ్ళాడు. 'అవ్వా! అవ్వా!!' అంటూ పలకరించాడు ఆర్ద్రహృదయుడై. సమాధానం శూన్యం. మూర్తికి కర్తవ్యం తోచలేదు.

మనస్సు తన కెందుకంది. చంచలత వంచన చేసింది. మూర్తి రోడ్డు మీద అడుగుపెట్టి అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్నాడు. తారురోడ్డు మెల్లమెల్లగా వెనక్కు వెళ్తున్నది. శరీరం ముందుకు నడుస్తున్నా మనస్సు వెనక్కు పరుగెడుతున్నది. ఆ అనాథ దేవుడిదయకుకూడా నోచుకోలేదా? ఆమెగతి ఏమిటి? ఆమె బ్రతుకుతుందా?

మళ్ళీ వెనక్కువెళ్ళాడు. అర్థరాత్రి రెండుగంటల సమయంలో రోడ్డు మీద అటూయిటూ నడుస్తున్న అతనినిచూసి ప్రకృతి వికృతంగా నవ్వింది. 'ఏమిటీవెఱ్ఱి?' అని మనస్సు ప్రశ్నించింది. 'స్వప్న' బార్‌లో రెండుగంటలు కూర్చున్నప్పుడూ, జగదాంబ 70 MM లో మత్తుగా సోలిపోయినప్పుడూ అవసరంలేని ఈమె సంగతి ఇప్పుడు మాత్రమెందుకు?" అని ప్రశ్నించింది మనస్సు. 'భూతదయ' అన్నాడుమూర్తి బాధతో. 'సనిన్‌సీ'రో ప్రియురాలు పిలుస్తున్నది! అంది మనస్సు. 'షెటప్!' అన్నాడుమూర్తి ఉక్రోషంతో. 'ఇది నీకనవసరం' అంది మనస్సు. 'ఏమిటీశల్య సారధ్యం?' అని విసుక్కు

న్నాడు మూర్తి. 'పేదవాళ్లెప్పుడూ ఇంతే; వాళ్ళేడుపు నీకెందుకూ?' అంది మనస్సు.

కాళ్లు వెనక్కు లాగాయి. మళ్ళీ ముందుకు నడక ప్రారంభించాడు.

"బాబుగారూ! రిక్షా కావాలండీ?"

చటుక్కున తలెత్తిచూశాడు. మాట్లాడకుండా ఎక్కేశాడు. 'పోనీ!'

'ఏడకు బాబయ్యా?'

'ద్వారకానగర్'.

'ద్వారకానగరండి?'

'ఊఁ' నిషాలో మూలిగాడు.

రిక్షావాడు మెల్లగా తొక్కుతున్నాడు. 'మరి మనపేరండి!' అన్నాడు శ్మశాన శాంతిని గుర్తుకుతెస్తున్న నిశ్శబ్దాన్ని చీలుస్తూ.

'ఎందుకురా?' అన్నాడుమూర్తి, నవ్వి.

'నాపేరు అప్పలయ్యండి! అందుకని తమఁపేరు....

'అవసరమా?'

'మరేం నేదండి. మీరారోడ్డుమీద అలా ముందుకూ యెనక్కూ నడుత్తుంటే నాకు నవ్వొచ్చిందండి!' అన్నాడు అభినయిస్తూ.

'ఫూల్! నాకేడుపొచ్చిందిరా!' అని మనస్సులో అనుకొని, 'మరి నువ్వు నవ్వలేకపోయావా?' అన్నాడు బయటికి.

'మరేనండి. తమఁరు దబ్బులేమన్నా పారేసుకున్నారేటి?'

నవ్వాడు మూర్తి. 'ఏం? ఏరుకుంటావా?'

'నే.... నేదండి'.

'మానవ సంస్కారం చెల్లని రూపాయల్లా మారి_పోయిందిరా! ఆ చెల్లని రూపాయలు ఎవరికీ అక్కర్లేక రోడ్డన్నట గుట్టలుగా పారేశారు. అవ్వేరు కుందామని....

'కయిత్తం సెప్తున్నారు బాబయ్యా! కయిత్తానికేంగాని, సెల్లని రూపాయలు మనకెందుకు బాబయ్యా?'

'ఆ సంస్కారమే మనల్ని అధోగతికి చేర్చిందిరా! ఈ మానవజాతి_తోటి మానవులకు కూడుపెట్టలేని ఈ జాతి మానవసేవలేకుండానే మాధవసేవ చేస్తోందిరా? ఈ గుళ్ళూ గోపురాలూ ఎవణ్ణి సంతోషపెట్టేందుకు? ప్రాణం లేని రాయికి పత్రిపూజలూ, పరమాన్నాలూ, ప్రాణం ఉన్న ఆత్మకు పస్తులూ,

ప్రహరణాలూ.... ఈ జాతి బాగుపడి సేవకు పునరంకితమై చేవదేరిన సంఘంలా మారే పరిస్థితి ఈ కలియుగంలో రాదు. ఈ జగతి ధ్వంసమై, ఈ మనిషి నాశనమై, ఈ ప్రకృతి బూడిదై ....' అని ఏమేమో అనబోతున్నాడు ఆవేశంలో.

'అర్ధంకానేదు బాబయ్యా!' అని గొణిగాడు.

'నీలాగే చాలామందికి అర్థం కాదురా! స్వార్థం పరమార్థమై, ధర్మం అధర్మంగా మారినరోజుల్లో ఎవరికీ ఏమీ అర్థంకాదు. పండిపోయిన ఆ ముసలిది గుండెను చెరువు చేయడంలేదూ? నీదృష్టిని ఆముసలవ్వ ఆకర్షించలేదూ??'

'ఎవురు బాబయ్యా? ఆ అడుక్కుతినేదేటి?'

'మరే—డాబాగార్డెన్స్ దగ్గర ఫుట్‌పాత్‌మీద చూడలేదూ?'

'పోలమ్మండి!'

'కాబోలు ఆ దీనస్థితిని చూస్తుంటే హృదయం ద్రవించడంలేదూ?'

'మ....మ్మరేనండి. మీలా నాకు మాటలు రాటంనేదండి!'

నవ్వాడు మూర్తి. 'ఆమె సంగతి నీకు బాగా తెలుసా?'

'సిత్తం‌వండి. దానికెవరూ నేరండి. బాగున్నప్పుడు పాసిపని చేసుకున్నాదండి. బలముడిగిపోయిన తర్వాత ఎవరూ పెట్టుకోనేదండి. దానికి మాసెడ్డబిమానవండి. ఒక్కర్నికూడా పైసా అడిగేదికాదండి. ఎవరూ దానిమొగం చూడనేదండి. ఓపికున్నన్నాళ్ళు పస్తులుండి అభిమానం సంపుకుని అడుక్కుంటూ బయల్దేరిందండి....'

'హుం ఆమెకున్న అభిమానం అందరికీ ఉంటే ప్రపంచం తరించిపోయి ఉండును.'

'మరేనండి. ఒకనాడు దానికి జ్వరమొచ్చి రోడ్డమ్మట పడుంటే మీలాటి మారాజెవరో కేజీహెచ్చిలో చేర్చేసి నాడండి! నాల్రోజులుంచుకుని ఆళ్ళేమో నీపిరితో గెంటినదుమ్ముతోపాటు దాన్నీ గేటవతలకి గెంటారండి!'

'ఎంత అన్యాయం జరిగింది! పాలు పిండినన్నాళ్ళు పిండి, ఆవును కబేళాకు పంపినట్లు, ఈ ప్రకృతిమీదకు ఆమెను సమాజం వదిలేసింది. ఎముకలు కొరికే చలిలో ఏమీమిగలనిగతిలో ఆ రోడ్డుమీద అలాఏడుస్తుంటే ఎవరికీ పట్టలేదు.........'

'మరేనండి!' అప్పలయ్యాబాధగా అన్నాడు: 'డబ్బులోమునిగి తేలిపోయే మారాజులకు ఈ కట్టాలు మీకెందుకండీ! మా బతుకులన్నీ అంతే. పాతజనమలో సేసినపాపానికి ఈ జనమలో ఏడవద్దాబాబయ్యా? ఎవరైనా అంతే బాబయ్యా.

నాకూ ఎవరూలేరు. నేనూ రేపింతే. నాగతీ రేపింతే. నేనూ అలా ఏడుత్తూ, దుమ్ము నెత్తినోసుకుంటూ, ఈగలుతోలుకుంటూ ఏడవ్వాలి బాబయ్యా! నేనూ అంతే....' రిక్షావాడు ఏడుస్తున్నాడు.

'ఊరుకో అప్పలయ్యా! దిక్కులేని వాళ్ళకు దేవుడేదిక్కు.'

'నేదు బాబూ! డబ్బునోళ్ళకే దేవుడిదిక్కు. సివాచల స్వామికూడా డబ్బునేంది దరశనమీడు బాబయ్యా!'

'పోనీలే అప్పలయ్యా! దేవుడు కళ్ళుతెరిచేరోజు వస్తుంది. ఆరోజు మీకందరికి సుఖం కలుగుతుంది. అయితే నాబాధ ఆరోజు ఎంతఆలస్యంగా వస్తుందోనని. అసలు కళ్ళు తెరుస్తాడో లేదోకూడా అనుమానమే.'

'ద్వారకానగరొచ్చింది బాబయ్యా!'

'అలా పైకిపోనీ. ఆ చివరిమేడదగ్గరఆపు.'

'బాబుగారూ! డబ్బులిప్పించండి'. రిక్షా ఆగింది.

'ఎంతుచ్చుకుంటావ్?'

'మీదయ బాబయ్యా!'

'నువ్వు చెప్పు.'

'ముప్పావలాయిప్పించండి బాబయ్యా!'

'ఊఁ- రూపాయి చిల్లరుందా?'

'నేదు బాబయ్యా.'

'పోనీలే, దగ్గరుంచుకో. అంటూ నోటు విసిరివేసి గబగబా మేడమీది కెళ్ళబోయాడు.

'బాబయ్యా! బాబయ్యా!'

'ఏమిటి అప్పలయ్యా?'

'రూపాయినోటనుకుని అయిదురూపాయల నోటు ఇచ్చేసినారండి. మరి దీన్ని తీసుకోండి.'

'వద్దులే, ఉంచుకో' అని గబగబా పైకివెళ్ళాడు.

కళ్ళకద్దుకుని జేబులో పెట్టుకుని వెళ్ళిపోయాడు అప్పలయ్య.

* * *

తార్రోడ్డుమీద సర్రున సాగిపోతున్న వెస్పా చటుక్కున సడన్‌బ్రేకు వేసింది. మూర్తి పేవ్‌మెంట్‌మీద అడుగు పెట్టాడు.

నిర్జీవంలా ఉన్న ఆ జీవపదార్థం తనకూ చైతన్యం ఉన్నట్లు నిరూ

పిస్తున్నది. మూగుతున్న ఈగలనుతోలుకోలేక, కడుపులోచెలరేగుతున్న క్షుధాగ్ని జ్వాలలకు తట్టుకోలేక, బస్సులు లారీలు తనమీదపోసేస్తున్న దుమ్మును ఓర్చుకోలేక చేస్తున్న హృదయవిదారకధ్వని. ఆమె పెద్దగా ఏడుస్తున్నది.

'పోలమ్మా ! పోలమ్మా !' అని పలకరించాడు. ఆమెచేతిలో రెండ్రూపాయలను పెట్టాడు.

'వద్దు బాబుగారూ !'

'అలా అనకు పోలమ్మా !'

'దరమతండ్రి ! నీదరమం బతకాలని ఏడుత్తున్న వొందలాదికి సూపు తండ్రీ ! నేను బతకను. ఇయ్యాళో రేపో....'

ఆమె విపరీతంగా దగ్గుతున్నది. దగ్గుతెర ఆమెను ఉుగ్గిని చేస్తున్నది. అంతంలేని ఆ దగ్గుతెర ఆమె ప్రాణాలను తోడేస్తున్నది. చట్టూరా కంపు. ఆమె విసర్జించింది.

'బాబూ ! నన్నుసూత్తూ పెపంచమే మర్చిపోయారుబాబూ ! ఆ కూటరు మీద పోతున్నోళ్లిద్దరు మిమ్మల్ని సూసి పకపక నవ్వేత్తున్నారు. మీరెల్లండి బాబూ ! నే సచ్చిపోతా బాబూ !'

మళ్ళీ దగ్గుతెర. గుండెలు పగిలిపోయే దగ్గుతెర. ప్రేవులు అలసిపోయే దగ్గుతెర.

'బాబూ ! ఈ డబ్బు మీదగ్గరే ఉంచండి. దేవుడు సల్లగా సూత్తాడు— ఎల్లండిబాబూ ! ఎల్లండి.'

మళ్ళీ దగ్గుతెర.

ఆమె బాధను భరించలేక మూర్తి స్కూటరు స్టార్టుచేశాడు. అయిష్టంగా బయలుదేరింది స్కూటరు.

తిరుగు ప్రయాణంలో మళ్ళీ అటే వచ్చాడు.

ఏక్సిడెంట్ ! ఏదో లారీ ఆమెకు విముక్తి కలిగించే పుణ్యానికి నోచుకుంది. ఆమె కోరికను తీర్చింది. ఆమె శరీరాన్ని తనముందు చక్రాలకు కుషన్లా అమర్చుకుంది.

'నంజకూతురు ఫుట్ పాత్‌మీద కాపురమెట్టేసింది—దీని బాబుసొమ్మున్నట్టు' ఒక మహాత్ముని అభిభాషణ.

మౌనంగా మూర్తి ముందుకు సాగిపోయాడు.



# వేండిపండు

## విరపు బాలసుబ్రహ్మణ్యం

దిగిపోయే మంత్రి అధికారంకోసం పాకులాడేలాగా అస్తమించే సూర్యుడి కాంతులు ఆకాశమంతా పాకుతున్నై. ఎన్నికలముందటి వాగ్దానాల్లాగా సంధ్య సుందరంగా వెల్గిపోతుంది. రోజంతా తిరిగి తిరిగీ, రెక్కలు ముక్కలుచేసికొని సంపాదించినదాన్ని పక్షులు ప్రేమగా బిడ్డలకు అందిస్తున్నై. చూస్తుండగానే సంధ్యారాగం గొంతు నులిమేసి, చీకటి పట్టాభిషేకం చేసుకొంది.

ఎక్కడో ఆలోచిస్తూ హోటల్‌చేరి, నాలుగు మెతుకులు తిని బయట పడేసరికి ఏడుగంటలైంది. టౌన్‌హాల్ దారిపట్టాను. రోడ్లవెంబడి నిలబడి నెల జాణలు 'పిలిస్తే పలికే రోగాలతో పిలవకున్నా పలుకుతున్నారు'. టర్నింగుల్లో వెలగని వీధిదీపాలు వాళ్ళ కాశ్రియమిస్తూ 'ప్రజాసేవే మా ధ్యేయం' అంటు న్నాయి. అసమర్థుణ్ణి అధికారి వెక్కిరించినట్లు, దూసుకుపోయే కార్లు గుంటల్లోని నీళ్ళతో పాదచారుల్ని ఆపాదమస్తకం అభిషేకిస్తున్నై.

విషయం ఏమంటే ఏడున్నరకు టౌన్‌హాల్లో మా 'కాక'గారి కావ్యాన్ని సినీనటి రమ్యశ్రీ ఆవిష్కరిస్తుంది. అంకితంగొన్న మంత్రిగారు అధ్యక్షులు. అక్కడికే, ఆ సభకే మన యీ సుదీర్ఘయాత్ర.

కవిగార్నిగూర్చి, అంతకంటే ఆయన పేరునుగూర్చి మీకు కుతూహ లంగా ఉందనుకొంటాను. ఆయనగారి అసలుపేరు కామేశం. కలంపేరు 'కాల కంఠం'. అచ్చతెనుగులో చెప్పాలంటే ఆయన ఉద్యోగం మా స్కూల్లో 'ప్రధా నాంధ్రోపాధ్యాయకత్వం'.

'కా' అంటే మా కవికెంతో అభిమానం. దాని కాయన సవాలక్ష కార ణాలు సాలంకారంగా చెపుతాడు. ఆయన మొదటి కావ్యం 'కాహళి' అట. అది ఆయన్ను 'అభాగ్యాంధ్ర రసకహృదయాల్లో' ప్రతిష్ఠించిందట. అసలుపేరు పెట్టేందుకు ఆయన ఆర్నెలలు ఆలోచించాడట. ఇక ఆయన 'కాలకంఠం' నామధేయాన్ని ఆయన వర్ణించాల్సిందే. 'తాను విషం మింగి, అమృతం కక్కు తానంటాడు. ప్రళయం తెప్పిస్తానంటాడు. సర్వజ్ఞుడినంటాడు'. ఆసోదె అంతా చెప్పాలంటే తెల్లవారుతుంది. ఆస్ప్రో అవసరమవుతుంది. ఆయన కావ్యాలన్నీ 'కా'తోనే మొదలు.

అన్నట్టు మా స్కూల్లో ఒకరోజు ఈ చర్చ వచ్చింది. కవి విజృంభించి తిన్న ఇడ్లీలు అరిగేలా పైకప్పు ఎగిరేలా 'ఘోరున' ఉపన్యసించాడు. నేను తేల మొహంవేసి కళ్లు మిటకరించాను. మధ్యలో లేస్తే రసభంగమని, కాలకంఠుడు కన్ను తెరుస్తాడని 'పీరియడ్' ఐనా కదల్లేదు. అప్పుడు నా క్లాసు ఆరో తర గతివాళ్ళ అమ్మాయిల జడలకు రాళ్లు కట్టడం, వాళ్ళు హెడ్ మాస్టరుకు రిపోర్టు చేయడం ఆయన నన్ను చాటుగాపిల్చి చీవాట్లు పెట్టడం జరిగిందనుకోండి.

నేనా స్కూల్లో రెండో తెలుగుపండితుణ్ణి. అపుడే కాలేజీనుంచి వచ్చిన 'ఫిట్ ఫాంటు' రాయుణ్ణి. సాహిత్యం అంటే ఏమూలో కొంచెం ప్రేమ గబ్బి లంలా వేలాడుతుండడంవల్ల కాకగారి మాటల్ని వదలకుండా వినేవాణ్ణి. అయినా ఆయన నన్ను ఆగ్రహించేప్పటికి ఆన్నెల్ల పరీక్షలు దాపురించినై.

ఓనాడు నేనెక్కడో కునికిపాట్లు పడుతుంటే కాకగారే నన్ను మా ప్యూన్ ద్వారా పిలిపించారు. నేను ఆభాగ్యానికి అదిరిపడి, కాలర్ సర్దుకొని దర్శించు కొన్నాను. ధీరంగా, గంభీరంగా ధోవతికొంగు జుబ్బా జేబులో దోపుకొంటూ పళ్ళికిలించారు కాకగారు. నేనూ ఓ 'నమస్కారం' గొట్టి హనుమంతుడి ఫోజు పెట్టాను. ఇదిగో 'గోపీ! మా అమ్మాయికి క్లాసు పరీక్షల్లో కొంచెం మార్కులు అడ్జెస్టు చేయాలోయ్. ఈ వెధవ గవర్నమెంటు తీసే పరీక్షలు అందరికీ తీసి పారేయక ఈ ఏడోతరగతికి వెలగబెట్టింది. 'స్లిప్టెస్' మార్కులు రేపు కలుస్తా యటగా' అని దీర్ఘంతీశారు కాకగారు. 'ఇంతకంటె పుణ్య కార్యం ఏముం దండీ' అని, ఆయన గేయాలు రెండుకలిపి ఓ స్తోత్రం పఠించాను. పోజుమార్చి 'కాకా' పట్టాను. కామేశంగారు పొంగిపోయి 'గడుసువాడివే' అంటూ భుజం తట్టారు.

దానితో మా సంబంధం కృష్ణపక్షపుచీకటిలా, ఆఫీసరు లంచంరేటులా, హోటల్లో 'మెదువడ' ధరలా పెరిగింది. ఇంటికేపోయి కాకా పట్టసాగాను. ఆయన 'కవిత్వం' ఒలకబోసేవారు. నేను డోలుగొట్టే మంగలిలా తల తెగ తిప్పేవాడిని. తిప్పకుంటే నాబ్రతుకే ఆయన తిప్పగలడాయె. నేనూ గుణింతాలు నేర్చిన తెలుగు పండితుడినే గాబట్టి ప్రూఫులుగూడా దిద్దేవాడిని.

ఇలావుంటే చటుక్కున ఓరోజు ఒక ఐడియావచ్చిందినాకు. కవిగారికి 'కా' అంటేప్రీతి గాబట్టి 'కాలకంఠ కవిని' 'కాక' అంటె ఎంతబాగుంటుందిఅని పించింది. కవిగారికి చెప్పాను. ఆయన 'భళా! శిష్యా! ఏమినీ పాండి తీగరిమంబు!' అని అక్షతలు వేసినాడు.

చివరకు మా స్నేహం తారాస్థాయి చేరుకొంది. ఆయన ఏం చెప్పినా నేను చేయాల్సిందే. ఎపుడు 'బాతాఖానీ' ప్రారంభించినా అన్నీవదలుకొని క్లాసుకు స్వస్తిచెప్పి హాజరుగావలసిందే. ఆయన పుస్తకాలకు గార్దభవాహనాన్నై స్కూళ్ళన్నీ అడుక్కతిని అమ్మాలి. కొత్త పెళ్ళానికి పూలుకొనక పోయినా శిష్యభక్తి ప్రకటనల కోసం ఈయన క్రొత్తపుస్తకం కొనాలి. వారి దరహాస వీచికల్లు తేలుతూ, తూలుతూ ఉండాలి.

మీకు తెలుసు దీనివల్ల ఫలితంకూడా తక్కువేమీ ఉండదని. ఈయనగారి కవితారసం సేవిస్తూ ఒళ్ళుమఱిచి, కళ్లుమూసి ఉండాల్సివచ్చేది. ఆరుగంటలకు రాలేక సినిమాప్రోగ్రాం తప్పేటప్పటికి శ్రీమతి అక్షితలు, ఈసడింపులు మూతివిరుపులు, చేతిమెటికలు స్వాగతం పల్కేవి. ఇక వందపేజీల కాకగారి గ్రంథంకొని, పదిరూపాయలు తగలెయ్యగానే 'అహో! నాటిరాత్రి! అనుభవైకవేద్యం! ఆనందైక ధామం'.

ఒక్కోసారి 'ఈ గుంటలో ఎందుకుపడ్డామా?' అని తప్పించుకో చూచే వాడిని. కాని ఉరి ఇంకాబిగుసుకొనేది. ఏం చేసేది? నేను బలహీనుణ్ణి. మొగమాటం కొంపముంచేది. అసలునాకే యేంకర్మ, కాకగారంటే మా హెడ్మాష్టరుకే హడలు! కరణం నుంచీ కేంద్రమంత్రివరకు ఈయన గ్రంథాలు అంకితం గొన్నవారేనాయె. అనుకుంటే అరక్షణంలో ఉద్వాసన చెప్పించగలడాయె. ఇంతెందుకు? 'ఏమోయ్!' అని ఈయన మా హెడ్మాస్టర్ను పిలిస్తే 'ఏంస్వామీ!' అంటారాయన. ఇంక మీ ఊహకందని దేమీ ఉండదను కొంటాను.

ఓసారి దేన్నిగుఱించో మాకవి గొంతుచించుకొంటూ, 'అదిదేశచరిత్రలో మైలురాయి' అన్నాడు. కొంచెం కుఱ్ఱకారులో ఉన్న మా లెక్కలమాస్టరు 'ఇంకా ఏం మైలురాళ్ళండీ! కిలోమీటర్రాయి అనకుండా' అని ఓఛలోక్తి విసిరాడు. ఇకచూడండి. కాకగారు కాలకంఠం విప్పారు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే "గర్జించారు, భర్జించారు. పిడుగులవర్షం కురిపించారు." వారం దిరక్కముందే లెక్కలమాస్టారు ద్వీపాంతరం నుంచి 'మేఘసందేశం' పంపుకోవాల్సివచ్చింది.

అందుకే మాస్కూల్లో ఆయన్ని ఎవ్వరూ ఎదిరించలేరన్నాను. ఎప్పుడైనా అమావాస్యకో, పౌర్ణానికో క్లాసునుపావనం చేస్తాడు. 'పొట్టచించితే అక్షరంముక్క రానివెధవలు' అంటూ అయిదునిమిషాలు తిరక్కముందే బయటికొస్తాడు. సత్కారాలకో సన్మానాలకో పయనం కడతాడు. అసలు నాకుతెలియని సద్గుణాలేవీ ఆయనదగ్గరలేవని ఘంటా పథంగా చెప్పగలను. 'కన్యాశుల్కం'

కంటె ఆయనకు ఎదురింటి 'కాంతం' అంటే ఎంత అభిమానమున్నదీ, వర్డ్స్ విత్ కంటె 'వాట్ 64'తో ఎంతపరిచయ ముండేదీ ఈ మందభాగ్యుడెరగని విషయాలు కావు. కూర్చొనేది రెండతస్థుల మేడలో వ్రాసేది 'ఊరివెలుపలి గుడిసెలోపలి అంటరాని కళంకిని నేను' అంటూ.

మరి నేను ఆవిష్కరణ సభకు హాజరు కాకుంటే ఏమైనా ఉందా! రేపు మొహాన 'ఏమోయ్! పది నిమిషాలైనా జీవితంలో సార్థకం కాకూడదూ?' అని అడగడూ మరి. అసలాయన కవిత్వంకంటె ఎత్తిపొడుపులే ఘాటాయె. ఓసారి 'నేనూ పిచ్చిపిచ్చి గేయాలు రాస్తూ, చింపేస్తూ ఉంటా'నని ఎవ్వరో ఆయనకు చెప్పారు. సమయంచూసి ఏదో వంకతో 'ఈ కాలం కవిత్వం ఎంతోయ్? అనుకొంటే నీవూ నాలుక్కాతలు కూసి కావ్యమంటూ నామొహాన పారెయ్యలేవూ?' అంటూ కపాలం తాకేటట్లు జోకు విసిరాడు. అప్పటినుంచి కాగితంమీద కలం పెడితే ఒట్టనుకోండి.

ఈరోజు మా శ్రీమతి కూడా అమ్మగారింటికి దయచేయబట్టి, వచ్చిన వర్షమూ దురదృష్టవశాత్తు ఆగిపోబట్టి ప్రయాణం తప్పిందికాదు. టౌన్‌హాల్లో అడుగు పెట్టగానే 'తెలుగుజాతికి ఇంత రసపిపాస ఎక్కడినుంచి ఊడిపడిందా' అని గతుక్కుమన్నాను. తర్వాత తెలిసింది. ఇదంతా రమ్యశ్రీ మహిమ అని. టైముచూస్తే ఎనిమిది కావస్తోంది. ఆటాపాటా ఏమీలేదు. పాపం మంత్రిగారింకా సాపడలేదో ఏమో?

హాలంతా గోలగా ఉంది. రంగురంగుల సీతాకోకచిలకలు జుల్ఫాల హీరోల్ని వేటకుక్కల్లా తిప్పుతున్నై. ముందు సీట్లకోసం కండగలవాళ్ళు తన్నుకుంటూ భావైక్యం చాటుతున్నారు. ఒకాయన 'ఇది ఇండియన్ టైమోయ్' అంటున్నాడు. మరొక మహనీయుడు 'ఇందిరాగాంధీనుంచి యూరియా బస్తావరకు' విమర్శిస్తున్నాడు. ఇంకో దేశభక్తుడు అమెరికా సౌభాగ్యాన్ని వర్ణిస్తున్నాడు. ఈ దేశాభిమాన సౌరభం ముక్కుపుటాలనుగాక చెవుల్ని బ్రద్దలు చేస్తోంది.

నేను చిక్కమొగంవేసి లాభంలేదనుకొని, వెనకసీట్లో తూగుతూ కూలబడ్డాను. ఎక్కడ నిద్రపోతాననుకుందో ఏమో మూర్తిత్రయం దిగబడిందింతలోనే. అందరి కళ్ళూ స్టేజిమీదకు పాకినై. మంత్రిగారు అధ్యక్షాసనం స్వీకరించారు. వినాయకుడి పేరులో ఈయనపేరు మూడుభాగాలే గాబట్టి, ఈయనగారి పొట్టలో ఆయనపొట్ట మూడుభాగాలు ఉండేట్టుంది. ప్రక్కనే కాకగారు కండువా ఎగదోసు కొంటూ, రమ్యశ్రీ పైట దిగజార్చుకుంటూ కుర్చీని పావనంచేశారు.

ఓపిక చేసుకొని తల పట్టుకొని కూర్చొన్నాను. ఏవో లాంఛనాలు ముగిసినై. తర్వాత భారంగా మంత్రిగారు లేచారు. "ఈ 'కాలాంబరం' కావ్యం

నా కంకితంగావడం పూర్వజన్మ సుకృతం" అన్నారు. దాని కర్థం తెలియక నేను తికమకపడుతూంటే, 'కాలాంబరం' కాదండీ 'కాలాంబుదం' అని ఎవరో కేకేశారు. మరో ఐదునిమిషాలకే ఎవరో గడుగ్గాయి "రమ్యశ్రీ మాటాడాలి" అని అరవడం అందరూ చప్పట్లుకొట్టి మంత్రిగార్ని నోరు మూయించడం జరిగిపోయింది.

సినీనటి సవిలాసంగా లేచింది. అందరిమెడలూ జిరాఫీలను అనుకరిస్తున్నై. ఏదేదో చేతులు తిప్పుతూ కరతాళ ధ్వనుల్లో కాకతీరుతం మేళవించి సాగించామె. పెళ్ళాంపోరుతో నిద్రకు మొహంవాచిననేను తీరిగ్గా తూగి తూగీ కునుకుపట్టించాను.

టైము ఎంతయిందో తెలియదు. ఏదో పరిచిత కంఠం ఓంద్ర పెడుతున్నట్టుంటే అదిరిపడి లేచాను. పైకిచూస్తే రమ్యశ్రీ జానెడు జిలుగు పైట లేదు. హాల్లో సగం మందైనాలేరు. కాకగారు ఆవేశంతో తూగుతున్నారు. తన కావ్యంలోని భాగాలుకాబోలు చదువుతున్నారు. ప్రాణాలు తీస్తాడ్రాబాబూ! అనుకుంటూ అలా చెవులు నిక్కబెట్టానో లేదో—'నా ప్రాణం పీల్చిపీల్చి ఈ సమాజం పెరుగుతున్నది. నా రక్తం త్రాగిత్రాగీ ఈ వసుంధర తిరుగుతున్నది' అని ఠపీమని ఆపేసి 'వాటర్ ప్లీజ్' అన్నాడు. సభికులంతా కొక్కొరకెగులు వచ్చిన కోళ్ళలాగా హుర్రే! హుర్రే! అంటున్నారు. అరుస్తున్నారు.

కాకగారు వాటర్‌లాంటి ద్రవం ఏదో సేవించి, మళ్ళీ గొంతెత్తాడు. ఐనా ఆ అరుపుల్లో నాకేమీ వినిపించలేదు. టైం తొమ్మిదిన్నర దాటుతోంది. ఇంతలో నా అదృష్టం కలిసొచ్చి మంత్రిగారు లేచి ఏదో కవిగారి చెవిలో ఊదారు. అప్పటికే కూసికూసీ అలసిపోయిన కాకగారు—"కర్మతత్వపు కాంతులునింపే విశ్వమానవ జగతిని నేను." "సహార్దసమ్మదశాంతులు పంచే దివ్యభాగ్య స్రవంతినినేను" అంటూ రాగంతీసి, గాలి తీసిన బ్లాడర్‌లా చతికిలబడ్డారు.

'జనగణమన' నపుంసకుడి ముందుకు రంభలా వచ్చి, మంత్రిగారు టోపీ సర్దుకుంటూంటే, కాకగారు ధోవతి అంచులు మడుచుకొంటూంటే, మేము కుర్చీలసందుల్లోంచి రాలేక చస్తూంటే చూసి ముగ్గురికీ మూడుసార్లు 'జయహే' అని నిష్క్రమించింది.

మరునాడు కాకాగారు ఏకాంతాన్ని సేవిస్తూ విశ్రాంతి తీసుకుంటూ బడికి రాలేదు. కర్మగాలి ఆరోజే మా పదోతరగతి వాళ్ళ సర్టిఫికేట్లు పోస్టులో ఊడిపడ్డవి. తప్పిన ముప్పైరెండు మందిలో ఇరవై తొమ్మిదిమందికి 'స్వభాష'లోనే క్షవరం. మా హిందీమేడం (లెక్కల మాస్టరుగారి భార్య) పైట చాటు చేసుకొని కిసుక్కున నవ్వింది. 'టీని భావమేమి తిరుమలేశా!' అని నేను తేలమొహం వేశాను.



# ఆ కళ్ళలోని ఆ కళ్ళు

"సస్యశ్రీ"

పగలంతా పట్టువిడువని పాడుముండా పీడజ్వరం
సాయంకాలనికల్లా సంధిలోకి దించేసింది ;
పట్టుమని పదేళ్ళే పైపడని మా చిట్టిబాబు
అట్టుడికి పోతున్నాడు, పాపం, తట్టుకోలేక యీ తాపం.
ఒళ్ళు తెలియని మైకంలో తుళ్ళితుళ్ళిపడుతూ
పలవరిస్తున్నాడు నా ఒళ్ళో పదే పదే ఏదో !
మూసిన కన్ను విప్పకుండా మూలుగుతూనే ఉన్నాడు ;
కాసిని నీళ్ళుకూడా నోట పోసుకోలేకపోతున్నాడు—

*        *        *

నిన్నటివరకు చిరంజీవి నిక్షేపంలాగున్నాడు ;
టన్నులు "నేపాం" బాంబులు రాలిపోతూవుంటే,
ఉన్న కొంప నడికొప్పు కాలిపోతూవుంటే,
ఎన్నో మరతుపాకులు పేలిపోతూవుంటే,
కొన్ని వేలప్రాణాలే కూలిపోతూవుంటే,
నిలదొక్కుకుని యిన్నాళ్ళూ నిబ్బరంగానే వున్నాడు ;
కాని,—నిన్న కన్నతల్లి ఖూన్ కళ్ళారా చూసేక
చిన్నారి చిరుత గుండెలు నిలుస్తాయా, చిన్నాభిన్నమైపోక ?

*        *        *

ఆరు గంటలకు నిన్నటి అసుర సంధ్యవేళ,
కళ్ళెదుట వాళ్ళమ్మ కడుపు చించుకుంది,
మానంకోసం, దేశాభిమానంకోసం, నిజ
ప్రాణాన్నే బలిదానం చేసుకొంది ;
చెఱబుట్టిన కఱకు తురక కసాయి కరాల్నుండి
శివమెత్తిన శక్తిలాగ, సిగ విడిపించుకొని
"జోయ్—బాంగ్లా" అంటూ అమరజ్యోతిలో చేరిపోయింది.

అప్పటివరకూ చెక్కుచెదరని నాగమ్మ ఒక్కుమ్మడిగా బెదరిపోయేడు;
ఆ ఆత్మాభులనాపనేక, ఈ ఆత్మాహుతికోపలేక
బేజారై గుండె, బిడ్డడు బిక్కచచ్చిపోయేడు.
"అమ్మా" అని ఆక్రోసిస్తూ, నా అడ్డాల్లో ఒరిగిపోయేడు.
నన్నంతకుముందే ఓ పిరికిపాక్ మరతుపాకీ
వెన్నుమీద వెనుకదెబ్బ కొట్టి, ఉండీ లేకుండా చేసింది;
ఉన్నాను నేనిట మొదలు నరికిన మ్రోడులా బ్రతికుండీ కూడా చచ్చి
తన్నుకుంటూ నడుంవిరిగిన నాగులా తల్రప్రాణం తోకకువచ్చి।

* * *

అప్పుడు మూసిన కళ్లు, బాబు యిప్పటికీ విప్పలేదు;
అప్పుడప్పుడు మూలుగు మధ్య తప్పుడుమాటలూ తప్పలేదు.
నే నేలాగూ నిలువను,—కాని, నా బాబు బతకాలి,
నేను కళ్లు మూసేముందు బాబు కళ్లు తెరవాలి;—
లేని వోపిక తెచ్చుకుని, లేతనుదురు నిమురుతూ
"బాధగా వుందా బాబూ" అని బాధపడుతూ అడిగేను;
అప్పుడు నా తండ్రి "అమ్మా" అంటూ ఒక్కపరి కళ్లు తెరచేడు
రెప్పపాటులో మూసేసుకుని లోకం మళ్ళీ మరచేడు।

* * *

అప్పుడు నేను చూచేను, నాకన్నపాప కళ్ళను;
నా కళ్ళలో ఆ కళ్ళను; ఆ కళ్ళలో ఆకళ్ళను।

* * *

అప్పుడు నేను చూచేను ఆ కళ్ళలో—
ఆనాటి అనిలో అధర్మానికీ, ఓనాటి పనిలో సధర్మానికీ
ఆహుతి అయిన ఒంటరీళ్ళు, అభిమన్యు, కేసబియాంకా
ఆత్మశాంతికీ, అసహాయతకీ అచ్చుగుద్దిన కళ్ళను।
అప్పుడు నేను చూసేను ఆ కళ్ళలో—
దొంగచాటు విల్లుదెబ్బతిన్న బెంగాల్జెబ్బులిపిల్ల
చురుకు చూపులలో జ్వలించే చింతనిప్పుల చిచ్చుబుడ్లను,
క్రోధభయ విభ్రాంతుల కొండిపోడు సెగళ్ళను।

* * *

అప్పుడు నేను చూసేను ఆ కళ్ళలో—
"హరోం హరహరా" అంటూ హరాకిరీ చేసుకునేముందు
చెరపబడ్డ కులకాంత చిచ్చురచూపులు వ్రాసిన
మరణ శాసనంలోని చరమసందేశపు తప్సీళ్ళను!
అప్పుడు నేను చూచేను ఆ కళ్ళలో—
ముక్తి ఫౌజు మత్తేభాల రక్తం తాగి, బాంగ్లాదేశ్ బ్లడ్ బాత్‌లో తోగి
'పాక్' పాపాల మడుగులో పైశాచిక నృత్యంచేసే
నక్రాలవక్రాల మీది సుదర్శన చక్రపు పళ్ళను!

* * *

అప్పుడు నేను చూచేను ఆ కళ్ళలో—
వీరనారి, రోషనార బోరలోని, విసూ వియస్ పగిలి
విప్లవ లావాని వియత్తలానికి రుప్పినప్పుడు
ఉడుకు రక్తంతో రాలిన పిడుగురాళ్ళకు, ఫిరంగి గుళ్ళను!
అప్పుడు నేను చూచేను ఆ కళ్ళలో—ఆ క్షణంలో—
అనేకరకాల ఆకళ్ళను; ఆపోవని ఆకళ్ళను;—
అర్భకునిలోని, అడవిపులిలోని, ఆత్మహననంలోని ఆకళ్ళను
ఆర్తారావంలోని, ఆదిశక్తిలోని, హోరుహోరుమనే ఆకళ్ళను!
ఒంటరిగా ఓ దేశం ఆర్చేవాళ్ళూ తీర్చేవాళ్ళూ లేక,
ఆతతాయుల ఆగడాలకు అరణి అయిపోతూవుంటే,
కాలిపోతూవున్న డెమోక్రసీ కడుపులోని
కార్చిచ్చులాంటి ఆకళ్ళను; ఆకళ్ళకే వేపే ఆకళ్ళను!!!

* * *

బాబు ఒళ్ళు మళ్ళీతడిమి "బాధతగ్గిందా?" అని అడిగేను.
ఒళ్ళోని బొట్టెడు కళ్ళు కదపలేదు, పెదవి మెదపలేదు—
అప్పుడు ఛట్టున తట్టింది నాకు అది అర్థంలేని ప్రశ్న అని!
బాధ అవిభాజ్యమనీ, అందుభాగం పొందలేమనీ!

# యువభారతి ప్రచురణలు *



1. సరస్వతీ సాక్షాత్కారం-అనుముల కృష్ణమూర్తి (కావ్యం) రు. 3-00
•2. జీవనగీత-కాళోజి (ఖలీల్ జిబ్రాన్ The Prophet కు తెలుగు రు. 2-50
•3. వీచికలు (కవితా సంకలనం) రు. 2-00
•4. పంచవటి (కథల సంపుటి) రు. 2-00
5. రచన రు. 7-00
(మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు-వ్యాససంపుటి)
•6. కావ్యలహరి-ఆచార్య దివాకర్ల వేంకటావధాని రు. 5-00
•7. అక్షరాలు (కవితా సంకలనం) రు. 2-00
8. చైతన్యలహరి-ఉపన్యాసమంజరి రు. 6-00
9. మహతి-(నూర్గురు ప్రముఖుల వ్యాస సంకలనం) రు. 20-00
10. ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్ (34 వ్యాసాల సంకలనం) రు. 10-00
•11. స్వరాలు (కవితా సంకలనం) రు. 3-00
•12. ఉషస్సు రు. 3-00
(యువభారతి సాహితీమిత్రుల ఉగాది కవితాసంకలనం)
13. మళ్ళీవెలుగు-శ్రీ శీలా వీర్రాజు (వచన కవితా కావ్యం) రు. 4-00
14. ఉదయం (యువభారతీయుల కథా సంకలనం) రు. 2-00
15. కథావాహిని-1 (యువభారతి సాహితీమిత్రుల కథాసకకలనం) రు. 2-00
16. కథావాహిని-2 ,, ,, రు. 2-00

• ఈ గుర్తుగల పుస్తకముల ప్రతులు లేవు.

* సాహితీమిత్రులకు ప్రత్యేక తగ్గింపు

# పరిచయాలు



## చంద్రముఖి వేణు

పూర్తి పేరు: చంద్రిముఖి వేణుగోపాల్. పెద్దతరహా గుమాస్తా, చాదర్ ఘాట్ హైస్కూల్, హైదరాబాదు. వయస్సు: 27. అభిరుచులు: సాహిత్యాధ్యయనం, వ్రాయటం.

## ద్విభాష్యం రాజేశ్వరరావు

సీనియర్ ప్రాసెస్ ఆపరేటర్, కోరమాండల్ ఫెర్టిలైజర్స్, విశాఖపట్టణం. వయస్సు: 28. అభిరుచులు: తీరిక అంటూ లభిస్తే పుస్తకాలు చదువుకోటం.

## అంపేరాయని చంద్రశేఖరరావు

కలంపేరు: అంపేరాయని. ఉద్యోగస్తులు. వయస్సు: 39. అభిరుచులు: "మనిషిగా బ్రతకటం, రచయితగా జీవించటం" అంటారు.

## దాడి వీరభద్రరావు

అధ్యాపకులు; ఎ.ఎమ్.ఎ.ఎల్. కళాశాల, అనకాపల్లి. వయస్సు: 24. వీరి రచనలు వివిధ పత్రికలలో ప్రచురితాలు. అభిరుచులు: నటించడం, సేవా సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనడం.

## కుమారి ఆలేటి నాగమణి

క్లర్క్, ఇన్‌కమ్‌ట్యాక్స్ డిపార్టుమెంటు. వయస్సు: 21. అభిరుచులు: రచనలు చేయడంతోపాటు మంచి రచనలు చదవడం 'నా కిష్టం' అంటారు.

## కాకాని కమల

జననం: 10-8-1953. అభిరుచులు: సాహిత్యం, చిత్రలేఖనం.

## సి. ఎం. రామకృష్ణారెడ్డి

ఉపాధ్యాయులు; ఎస్. జె. పి. ఉన్నత పాఠశాల, గుంతకల్. వయస్సు: 30. అభిరుచులు: పుస్తకాలు చదవడం.

## పమిడిమర్రి శంభుప్రసాద్

ఉపన్యాసకులు. వయస్సు: 23. అభిరుచులు: సంగీత సాహిత్యాదులు.

## వీరపు బాలసుబ్రహ్మణ్యం

కలంపేరు: 'కోణార్క' (గేయాలకు పరిమితం). తెలుగు పండితులు, జిల్లా పరిషదున్నత పాఠశాల, మల్లాం. వయస్సు: 23. అభిరుచులు: పఠనం వ్యాసాంగంగా, రచన పాథేయంగా కదలిపోవడం.

## సస్యశ్రీ

అసలుపేరు: సోమయాజుల సంగమేశ్వరశర్మ. 1968 వరకూ ప్రభుత్వ వ్యవసాయశాఖలో ఉద్యోగం; ప్రస్తుతం ఏటికొప్పాక సహకార చక్కెర ఫ్యాక్టరీలో చెరుకు అభివృద్ధి శాఖపై పర్యవేక్షకులు. వయస్సు: 61. అభిరుచులు: సౌందర్యోపాసన, లలితకళలంటే సరదా. ఆధునిక సారస్వతం చదవటం, గేయాలు వ్రాయటం, నాటకాలు వేయించటం ఇష్టం.

# మా గురించి



మనిషిలో అంతర్లీనంగా నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సార్థక్యానికీ, సృజనాత్మక శక్తికీ సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం ఏర్పడుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

ఆలోచనా స్వేచ్ఛ దేశ పురోగతికి దోహదం కలిగించే విధంగాను కళా సృష్టికి ప్రతిభావ్యుత్పత్తులు ప్రాతిపదికలు కాగలిగే విధంగాను, వ్యక్తిత్వ నిర్మాణం సాంఘికాభ్యుదయంతో పెనవేసుకొనిపోయే విధంగాను, సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలను సజీవజాతి నిర్వహించుకుంటుంది. ప్రజాస్వామ్య వ్యవస్థకు నారుపోసేవీ నీరుపోసేవీ ప్రతిభాసౌమనస్యాలే.

యువభారతి కడచిన పదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతిని అందంగా శక్తిమంతంగా అర్థవంతంగా మాట్లాడగలిగే సామర్థ్యాన్ని రచించగలిగే నైపుణ్యాన్నీ, ఎదుటివారి అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్నీ, ఆలోచనను రేకెత్తించి వివేకాన్ని ఉద్దీపింప చేయగలిగే అధ్యయనశీలతనూ, అలవరచేందుకు విభిన్న దృక్కోణాలతో రూపొందించి నిర్వహిస్తున్నది.

సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఉత్తమ సాహిత్యాన్ని ప్రజానీకానికి అందిస్తే సాహిత్యంపట్ల అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ పూర్వవిరాళ పద్ధతిని ప్రవేశపెట్టి సరస్వతీ సాక్షాత్కారం, జీవనగీత, కావ్యలహరి, చైతన్యలహరి, వికాసలహరిలవంటి సాహితీ తపోమూర్తుల సందేశాలనందించే గ్రంథాలను వేనవేల సంఖ్యలో ప్రచురించి ఉభయ నగరాలలోని రసికులనేగాక యావదాంధ్ర దేశంలోని సాహితీప్రియుల మన్ననలను పొందగల్గింది. 'మారుతున్న విలువలు'–'రచయితల బాధ్యతలు' అనే ఒక గోష్ఠిని

నిర్వహించి ఆ గోష్ఠి వ్యాసాలను 'రచన'గా ప్రచురించింది. భారత స్వాతంత్ర్య రజతోత్సవ సందర్భంగా కడచిన 25 ఏళ్ళలో తెలుగుదేశంలో సాంస్కృతిక సాహిత్య భాషా సంబంధమైన తీరుతెన్నులను వివరిస్తూ మారుగురు ప్రముఖుల వ్యాసాల సంపుటిని 'మహతి'గా ప్రచురించింది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగల్గేందుకు రసికులకు సాహితీమిత్ర పథకాన్ని రూపొందించింది. సహృదయులను అన్వేషిస్తూ యువభారతి చేసిన కృషికి ఫలితంగా ఇప్పటికి దాదాపు మూడువేల ఐదువందలమంది సాహితీమిత్రులుగా చేరినారు. ఈ సాహితీమిత్రుల సాహితీవికాసానికి తోడ్పడేందుకు ఒక కవితా సంకలనం 'ఉషస్సు'ను 'కథావాహిని' అనే రెండు కథాసంకలనాలను ప్రచురించింది. యువభారతి సభ్యుల కవితా, కథాసంకలనాలు 'వీచికలు-అక్షరాలు-స్వరాలు-ఉదయం" కూడ వెలువడినవి.

జంటనగరాలలో వేనవేల సంఖ్యలలో భాషాభిమానులను ఆకర్షించి పెద్ద ఎత్తున సాహిత్యసభలను నిర్వహించగల్గింది.

తెలుగు సాహిత్యంగురించి తెలుగువారికి తెలపడమేకాదు. అన్యభాషీయులకుగూడా తెలుప బూనుకోవడంలో ఔచిత్యముందని అలాగే అన్యభాషా సాహిత్య సంస్కృతుల విశేషాలను తెలుగువారు తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉందని మా విశ్వాసం. దీనికి నాందిగా 37 ఇంగ్లీషు వ్యాసాల సంకలనం "Free India Forges Ahead" ను వెలువరించింది. మూరేళ్ళ తెలుగు నవల ప్రపంచ సాహిత్యానికి అందించిన కానుకగా చిరకాలం నిలువ గలిగే దాదాపు ఇరవైరెండు నవలలను గురించి సాహిత్యాత్మక పరిచయ వ్యాసాలను ఇంగ్లీషులో వ్రాయించి 'Telugu Novel' గా 1974 జనవరిలో వెలువరించనున్నది.

1974లో 'యువత' గోష్ఠిని నిర్వహించడానికి ప్రణాళికను సిద్ధంచేసింది. దేశంలో యువకులు నిర్వహించిన, నిర్వహిస్తున్న, నిర్వహించవలసిన పాత్రను గూర్చి ఈ గోష్ఠిలో చర్చలు జరుగుతాయి. దాదాపు 70 వ్యాసాల సంకలనం 'యువత' అనే పేరుతో వెలువడుతుందికూడా.

ఉడుతాభక్తితో మేముచేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు, వారి సౌహార్దం, భాషాప్రియత్వం. ఇదే మా పెట్టుబడి. మా తపస్సు, ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం, సామరస్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షుడు.

విజయదశమి
7-10-1973

యువభారతి







సమాజంలో సాహిత్యం
కావ్యలహరి చైతన్యంలా
నవలాస్యం చేయాలని
యువభారతి లక్ష్యం!
సాహితీ మిత్రులుగా
యువభారతి సంస్థ మీకు
ఆహ్వాన మందిస్తున్నది

సాహిత్యకళా సంస్కృతి సాధనకూ
సమ్యక్ శోధనకూ
విస్తృత స్నేహారాధనకూ
విశ్వశ్రేయ స్సాధనకూ
'సాహితీమిత్ర' పథకంలో
సభ్యులుగా చేరండి
విశేషాలకూ, వివరాలకూ

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

యువభారతి సాహితీచైతన్యంతో పదోవసంతం ప్రచురణలు



మందార మకరందాలు

